వాటపు వలపతఁడు వారవట్టుకుండఁగాను
వూటలేల పోఁ జల్లేవే వోయింతి
పాటించి సరసముల పన్నీరతఁడు నించి
చీటికి మాటికి వేఁడీ చిత్తగించ గదవే ॥ ఒద్దే ॥

అప్పుడే కాఁగిటఁ గూడి ఆయములతఁడంటఁగా
వుప్పతించేవేలె రతులోయింతి
చిప్పిలె కాఁగిటిలోన శ్రీవేంకటేశ్వరుఁడు
చెప్పరాని చేఁతసేసీఁ జిత్తగించ గదవే. ॥ ఒద్దే ॥ 70

## రామక్రియ

ఏలనాచే మొక్కించేరే యిప్పుడేనన్ను
కాలగాలమున మేలు కనుఁగొనేఁగాక ॥ పల్లవి ॥

పంతమే ఫలముగాఁగ బ్రదికేటి వారికి
చెంతలఁ బ్రియాలు చెప్పఁజెల్లునటవే
దొంతులు వేరిచేనంటే తోదోపులు వలపులు
కాంతుఁడు మన్నించిన కనుఁగొనేఁగాక ॥ ఏల ॥

రాజసమే ఫలముగా రచ్చసేసేవారికి
వోజదప్పి కిందుపడ నోనరునటే
సాజము చూచేనంటే చలములు బహళము
పూజ లాతనిచేతనే పొరసేఁగాక ॥ ఏల ॥

కూటములె ఫలముగా గురియైనవారికి
పాటించి కోపించుకొనఁ బాడియటవే
యీటున శ్రీవేంకటేశుఁడింతలోనే నన్నుఁగూడె
తేటలనాతనివల్లఁ దిరమయ్యేఁ గాక. ॥ ఏల ॥ 71

## సామంతం

ఇద్దరును నవ్వీరిదె యెదమాటలిఁకనేల
కొద్దిమీర మనమెల్లాఁ గోరినట్టే ఆయెను ॥ పల్లవి ॥

సరసములాడగాను చవివుట్టె వలపులు
విరసపుటలుకలు వెడజారెను
తరితీపులవల్లను తమివుట్టె మీద మీద
కెరలిన వోట్లలో కిసరులు వానెను ॥ ఇద్ద॥

కందువలనుండగా కన్నులకు నింపులాయ
మందలించి వెనకటి మంకులుమానె
సందడించి పెనగగా చనవులు మితిమీరె
చిందువందులైనట్టి సిగ్గు వెడజారెను ॥ ఇద్ద॥

మంచి మాటలాడగాను మోవులతేనె దొరకె
చంచలపు గపటాల సడిదీరెను
యెంచగ శ్రీవేంకటేశుడింతియును గూడిరిదె
కొంచముదొడ్డెరగని కొసరులు దక్కెను. ॥ ఇద్ద ॥ 72

213—వ రేకు హిజ్జిజి

కానీవే యెంతకెంత గబ్బితనము
యీనెపములెల్లాను యెరగనదె ॥ పల్లవి ॥

నవ్వులనె వొకమాట నటనలనొకమాట
దివ్వెనలనొకమాట తిట్టేవేమే
పువ్వులనె వొకవాటు పోరచినె వొకవాటు
యివ్వలనే వేసితేను యేమిసేసేవే ॥ కానీ ॥

కన్నులమొనలుచూపి కతలమొనలుచూపి
చన్నులమొనలుచూపి సాదించేవే
నున్ననిగోరుదీసి నూగురుల కొప్పుదీసి
యిన్నినే రట్టుసేసితే నేమిసేసేవే ॥ కానీ ॥

బిగువుగాగిట బట్టి బీరమున జలపట్టి
పగటున కొనగొంగు పట్టేవేమే
జిగిమించగలసితి శ్రీవేంకటేశుడదాను
మెగసక్కెల దూరితే నేమిసేసేవే. ॥ కానీ ॥ 73

కొండమలహరి

ఏలనన్నుఁ బాసితివి యిందాఁకానేదపరాకు
 తాలిమిగలదాననా తలఁచి నీయడకు ॥ పల్లవి ॥

మొక్కితిఁగా అల్లనాఁడె మొరఁగులు మానుమని
 తక్కులేక వలచినదాన నేనని
 నిక్కపుటాసలు నాలో నిండియుండవివియని
 మక్కువనాతోఁగూడి మన్నించుమని ॥ ఏల ॥

సేవలెల్లాఁ జేసితిగా సిగ్గులు వడకుమని
 వేవేలు నావిన్నపాలు వినుమని
 భావించునావల్ల నీకు పంతమెల్లాఁజేరెనని
 నీవల్లఁ దప్పులేకుండా నెరవేరించుమని ॥ ఏల ॥

కప్పితిఁగాపయ్యద యీకపటము వానెనని
 చిప్పిలె నాచిత్తము నీచేఁతలనని
 యిప్పుడె శ్రీవేంకటేశ యేలితివి నన్నునిట్టె
 దప్పిదేరె మోవితేనెఁదనిసితినని. ॥ ఏల ॥ 74

నాదరామక్రియ

మీరే యెరఁగరా యిన్ని మేటిజాణలు
 మారుమోములిఁకనేల మాటాడరాదా ॥ పల్లవి ॥

సతమైన కూరిమికి సాదించనేల
 హితవైన వినయాలే యింపులుగాక
 కుతిలంబులేని మతి కొసరనేల
 రతికెక్కె చనవు మెరయుటగాక ॥ మీరే ॥

ఆసపడ్డ చూపులకు నడ్డాఁకలేల
 వేసటలేక నవ్వుచే వేడుకగాక
సేసవాలవావులకు సిబ్బితియేల
 మోసపోని కూటములే ముచ్చటలుగాక ॥ మీరే ॥

ఆయాలు సోఁకిన పనికచ్చికమేలా
చాయలు సన్నలునే చవులుగాక
యీయెడ శ్రీవేంకటేశ యింతీనీవూఁ గూడితిరి
రేయిఁబగలివే పెరరేఁపులుగాక. ॥ మీరే ॥ 75

శుద్ధదేశి

వెల్లవిరాయఁ బనులు వేసాలేలే
గొల్లదానవా నీవు కొంకనిఁకనేఁటికే ॥ పల్లవి ॥
కన్నులతేటలు వారె కళలు మోమునమీరె
చిన్నదానవా యింకా సిగ్గునేఁటికే
చన్నులకొండలమీద చంద్రవంకలవె నిండె
కన్నెపడుచవా నీవు కప్పి దాఁచనేఁటికే ॥ వెల్ల ॥
పొలుకొనెఁ బులకలు పమ్మె సిగ్గుమొలకలు
గోలదానవా యేమి గుట్టుదాఁచేవే
తూలుచును నీకొప్పు తుమ్మిదలెల్లా బెదరె
బాలదానవా వట్టిభయము నీకేఁటికే ॥ వెల్ల ॥
గాఁటపు నిట్టూర్పురేఁగె కమ్మని మోవెల్లరేఁగె
నేఁటిదానవా నీవు నివ్వెరగేలే
యీటువెట్టి శ్రీవేంకటేశుఁడిదె నిన్నుఁ గూడె
మాఁటుదానవా నీకు మతకములేఁటికే. ॥ వెల్ల ॥ 76

సౌరాష్ట్రం

మనలోనే యింతగద్దా మాఁటి మాఁటికి
వినిపించే వినవయ్యా విన్నపములెల్లను ॥ పల్లవి ॥
పక్కన నవ్వినప్పుడే భయమెల్లఁ బాసె నీవు
చెక్కు నొక్కినప్పుడే చింత దీరెను
యెక్కువ ప్రియములతో యేల వేడుకొనేవింత
మొక్కే నుండవయ్యా నీకు మోహించినదానను ॥ మన ॥

దండఁ గూచుండినప్పుడే తగవులెల్ల నీడేరె
కొండల చన్నులంటఁగా కోరికె దక్కె
వెండియు నాకెంతేసి వినయాలు సేసేవు
పందేనయ్యా నీవద్ద నేబత్తిగలదానను ॥ మన ॥

కలసిన యప్పుడే కాయము తనివిఁబొందె
చెలిమి సేసినప్పుడే చెమరించెను
యెలమి శ్రీవేంకటేశ యీడేరితి నీ రతుల
చెలఁగే నిదిగోవయ్య సేవసేసేదానను. ॥ మన ॥ 77

దేసాక్షి

సరివచ్చెఁ గదవే చల్లేటి నీవలపులు
గరిమె నీరమణుఁడు గాలివంటివాఁడు ॥ పల్లవి ॥

తాలిమిగలవారికి తలఁపెల్లానీడేరు
ఆలరి కోపకత్తెలకాయాలు సోఁకు
యేల తప్పక చూచేవు యెఱఁగవా నీవిది
మేలిమి నీమగఁడు తుమ్మెదవంటివాఁడు ॥ సరి ॥

చెంతనున్నవారికి చేతికిఁ జిక్కు బనులు
పంతపు మగువలకుఁ బట్టుఁ జలము
మంతనమేమాడేవు మాఁటిమాఁటికి నాతోను
మంతుకెక్కె పతి నీడమానివంటివాఁడు ॥ సరి ॥

కూడినట్టివారికి గుణములెల్లా మంచివి
వేడుక వనితలకు వెలియే లోను
యీడనే శ్రీవేంకటేశునింతినీవు గూడితివి
తోడనితఁడెంచితే చంద్రునివంటివాఁడు. ॥ సరి ॥ 78

214—వ రేకు మాళవిగౌళ

ఏడనుండా నాసొమ్ము యెందు వొయ్యీనే
పీడెములో కప్పురమే పీనివలపెల్లను ॥ పల్లవి ॥

పంతమాడుకొనఁ గాని భావించ నాతనిరూపు
చింతించ నాలోనిదే చెప్పనేలే
దొంతివెట్టి గొల్లెతలు దోమటిదొడుకఁగాను
బంతిచిక్కినట్టి మోవిపండు నే దాఁచితినే ॥ ఏడ॥

విచ్చి చెప్పఁగాని తనవింతచక్కఁదనమెల్ల
పచ్చి నాచూపులలోనే పదరనేలె
ముచ్చటఁ బదారువేలు ముడిచివేసినపువ్వు
తెచ్చి నేదాఁచుకొంటిని దేవర యెరఁగదా ॥ ఏడ॥

అట్టు నీ నారతి నాఅడి శ్రీవేంకటేశుఁ
డొట్టి వారసినవార వారయనేలె
అట్టె తొల్లిటివారి అరచేతి నిమ్మపండు
గుట్టున నేఁదీసుకొంటి గుఱుతులడుగరె. ॥ ఏడ ॥ 79

హిందోళవసంతం

నేనుసేసే చేఁతలలో నెరుసున్నదా
వీనుల వినుమంటేను వేసరేవుగాక ॥ పల్లవి ॥

కప్పుర మిచ్చితిఁ గాక కవకవ నవ్వితినా
రెప్పల మొక్కితిఁగాక రేసు రేచేనా
ముప్పిరినెవ్వతెచేనో ముందువాడివచ్చి
దప్పితో నొక్కటొక్కటే తలచేవుగాక ॥ నేను ॥

చిగురందిచ్చితిఁగాక చేగోరు దాఁకించితినా
మొగమోటనుంటిఁగాక ముంచికైకోనా
మగువ యెవ్వతెచేనో మర్మాలు తొరలి వచ్చి
పగటులనూరకే భ్రమసేవుగాక ॥ నేను ॥

రతులఁ గూడితిఁ గాక రాజసము చూపితినా
సతమై యుండితిఁగాక సాదురీతిని
గతిమై శ్రీవేంకటేశ కదపలోఁ గూడితివి
మతి నెవ్వతోఁ దలఁచి మలసేవుగాక. ॥ నేను ॥ 80

ముఖారి

అవునయ్యా దొరవౌదువన్నిటా నీవు
విపరముతోడి నన్ను వీరిడిఁజేసేవు ॥ పల్లవి ॥

యెవ్వతెనో సరివెట్టేవేఁటికి నాతోఁ జలము
పువ్వువంటి మనసిట్టె పూఁపసేసేవు
జవ్వనమదముతోనే సరినన్నుఁ జేరితేను
నవ్వులనె పొద్దువుచ్చి నాలిసేసేవు ॥ అవు ॥

యెక్కడిదైనాఁ బిలిచేవెగసక్కెమెంత నీకు
లక్కవంటి వలపేల వుక్కుసేసేవు
లెక్కలేని యాసతోడ తెమ్మని నేఁగొసరితే
జక్కవ చన్నులేముట్టి జాగుసేసేవు ॥ అవు ॥

యెంతవడైనాఁ గూడేవేమి నేరుచుకొంటివి
వంతవంటి సిగ్గేఁటికి వాఁకసేసేవు
యింతలో శ్రీవేంకటేశ యిద్దరముఁ గూడితిమి
దొంతిమోవి తేనెలిచ్చి దొరఁజేసేవు. ॥ అవు ॥ 81

వసంతవరాళి

ఆతఁడిదె నీవిదె ఆసలెల్లా నెరవేరె
చేతికి లోనాయఁ బతి చెల్లునమ్మా ॥ పల్లవి ॥

మగఁడు నిన్ను మన్నించె మనసొక్కటాయనిఁక
నగవద్దా యిఁకనీవు నలినాక్షి
మగువలమున్నారము మంకుమీయలుకదీర్చ
జిగినీవు చేసినదే చేఁత యిఁకనమ్మా ॥ ఆత ॥

రమణుఁడు చెయి వట్టె రాజసము నీకుఁ దగు
చెమరించ నీకువద్దా చిగురుఁబోఁడి
అమరించఁగలము నీయంకెకు నన్నిపసులు
విమలము నీపగటు విచ్చనవిడెమ్మా ॥ ఆత ॥

శ్రీవేంకటేశుఁడు గూడె చెలివలమేల్మంగవు
నీ వాతని మెచ్చవద్దా నీలవేణి
చేవదేరె మాకౌఁగిలివు సేవలిట్టే సేసేము
కైవసమాయ రతులు కళదేరవమ్మా. ॥ అత ॥

మెంచబౌళి

ఎంతవానికెంతమాట యేలే యింత
మంతనాన నుండియును మాఁకుదీరదా ॥ పల్లవి ॥

కొప్పు దువ్వితేఁ బతిపైఁ గోపగించుకొనేవేమే
తప్పులేని తప్పుమోపి తమకింతురా
విప్పుచుఁ బ్రియము చెప్పి వేఁడుకొనీ నాతఁడే
దప్పిదేరె మోవిచూచి దయ వుట్టదా ॥ ఎంత ॥

ధీరతతోఁ జెక్కు నొక్కితేను విదిలించేవేమే
దూరులేని దూరుగట్టి దొమ్మిసేసేవు
సారపు నీసుద్దులెల్లా చవిసేసీనాతఁడే
కినాతనిఁ జూచి ఆయము గరఁగదా ॥ ఎంత ॥

చిప్పిలఁ గాఁగిలించితే జీరవారెననేవేమె
చొప్పులేని చొప్పులెత్తి సూడువట్టేవే
అప్పుఁడు శ్రీవేంకటేశుఁ డలమేల్మంగవు నీవు
చొప్పులుగాఁ బెంజెమట చూచి చింత వాయదా. ॥ ఎంత ॥

శ్రీరాగం

ఎత్తరే ఆరతులీపె కింతులాల
హత్తెను శ్రీవేంకటేశు కలమేలుమంగ ॥ పల్లవి ॥

హరి వురముపైసొమ్ము అరతఁగట్టినతాళి
సరిలేని దేవుని సంసారఫలము
సిరులకుఁ బుట్టినిల్లు సింగారములవిత్తు
మెరుఁగుఁబోడి యలమేలుమంగ ॥ ఎత ॥

పరమాత్మునికి నాత్మభావములో కీలుబొమ్మ
కెరలుచునితఁడు భోగించే మేడ
సరసపు సముద్రము సతమైన కొంగుపైఁడి
అరిది సంపదలది యలమేలుమంగ ॥ ఎత్త ॥

శ్రీవేంకటేశుని దేవి చిత్తజునిఁ గన్నతల్లి
యీ విభుని కాఁగిటిలో యేచిన కళ
జూవపు పెండ్లిమేలు పొందిన నిధానము
ఆవల నీవల నీపె యలమేలుమంగ. ॥ ఎత్త ॥ 84

215-వ రేకు వరాళి

అంతేసి యెరఁగలేము ఆడువారము
మంతనాన విన్నవించే మన్నించవయ్యా ॥ పల్లవి ॥

నీతో నేమాటాడితే నిజము నిష్ఠూరము
నీతెరిఁగి మాటలెల్ల నీవాడవయ్యా
చేతి మీఁదనే వుండవి చేకొను నామొక్కులెల్లా
మాతలఁపు లీడేరించి మన్నించవయ్యా ॥ అంతే ॥

సారె నీతో నవ్వితేనే సరసమే విరసము
నారీతి చూచి నీవే నవ్వవయ్యా
గారవపు నాగోళ్ళు నీగడ్డము పైనుండవి
మారుకొని వేఁడుకొనే మన్నించవయ్యా ॥ అంతే ॥

చన్నుల నిన్నొత్తితేనే చలములే పలములు
వున్నతిఁ గాఁగిట నీవే వొత్తవయ్యా
అన్నిటా శ్రీవేంకటేశ అలమేలుమంగ నేను
మన్నించి కూడితివింకా మన్నించవయ్యా. ॥ అంతే ॥ 85

శ్రీరాగం

తలవంచు కొననేలే తరుణి నీకు
యెలమిఁదప్పకచూచీ నిదివో నీవిభుఁడు ॥ పల్లవి ॥

తాలిమిగలచెలికి తలఁపెల్లా నీదేరు
జాలిఁబొరలకున్న చవియా మేలు
నాలి నెరపకుండితే నవ్వులు వేళమేవచ్చు
యీలీలనే వుండరాదా యిదివో నీవిభుఁడు
మాట వాడఁబడికైతే మనసులు గరఁగును
యీటుకుఁ బెనఁగితేను యిచ్చక మవును
కూటములు గలిగితే గుణములు చక్కనవును
యేఁటికి నూరకుందాన విదివో నీవిభుఁడు ॥ తల॥
తగవుల నడచితే తప్పదు సంతోషము
మొగమోట గలిగితే మోహముమించు
జిగి యలమేలుమంగ శ్రీవేంకటాద్రివిభుని
యెగసక్యాలకే కూడితితఁడే నీవిభుఁడు. ॥ తల ॥ 86

బౌళి

నీకుదొరకితేఁగన నీవుమానేవా
మైకొని నన్నిన్నిటాను మన్నించునితఁడు ॥ పల్లవి ॥
నేసవెట్టిన పతిని చెప్పినట్టు సేయించుకో
దోసమా నీవేల దూరవచ్చేవే
యీసు రేఁచుక దొడ్డ హితవరివలెనే
పోసరించి నాకేల బుద్ధిచెప్పేవే ॥ నీకు ॥
చేతికి లోనైనవాని చెక్కు వేల మీఁటితేను
యేతులా నీకేల యెకసక్యాలు
కాతరించి నీవే దగ్గరిన చుట్టమవలె
ఆతుమై నీవేఁటికి నాయాలు తిద్దేవే ॥ నీకు ॥
కూడిన శ్రీవేంకటేశు గోరనేను గీరితేను
ఆడికల నీవేల అడ్డమాడేవే
నీడనలమేల్మంగను నేను నాకంటె నెక్కుడా
చూడఁజూడ నీవేల జోహారనేవు. ॥ నీకు ॥ 87

## మాళవశ్రీ

అప్పణిచ్చేనిదె నీకు ననుమానించకుమిఁక
చిప్పిల మోహించిన నీచేతిలోనిదానను ॥ పల్లవి ॥

యెంతనవ్వినా మేలే యెరిఁగిన విభుఁడవు
చెంతనుండి మరియేమి సేసినా మేలే
యింతమాత్రమునకే యెగ్గులెంచ తప్పులెంచ
సంతోసాన నీకులోనై సమ్మతించేదానను ॥ అప్ప ॥

అలయించినా మేలే ఆయములెరుఁగుదువు
కొలువు యిట్టె సేయించుకొన్నా మేలే
మలసినమాత్రానకే మచ్చరించ నెచ్చరించ
చెలఁగుదు నీపాదాల సేవసేసేదానను ॥ అప్ప ॥

చేరి కూడితివి మేలే శ్రీవేంకటేశుఁడవు
యీరీతినలమేల్మంగనేమన్నా మేలే
సారె యీమాత్రానకే జంకించ బొంకించ
మేరతోనుండుదు నిన్ను మెచ్చేటిదానను. ॥ అప్ప ॥ ౪౪

## సాళంగనాట

అన్నిటా నేరుపరిగా అలమేలుమంగ నీకు
చిన్నిచిన్నిముద్దులనే సిగ్గువిడిపించెను ॥ పల్లవి ॥

చనవు మెరసి నిన్ను సారెసారెఁ బేరుకొని
మనసు దనియ నాపె మాటలాడెను
కనుసన్నచూపులనె కప్పురవిడెములిచ్చి
తనువు దనియ నీపైఁ దలఁబాలు వోసెను ॥ అన్ని ॥

పన్నుగడలతోడనే పానుపుచేరువనే
కన్నులుదనియఁగ దగ్గరి నిల్చెను
మన్ననలు దైవార మచ్చికలు పెడరేఁచి
విన్నపీనులు దనియ విన్నపాలు సేసెను ॥ అన్ని ॥

మాఁగిన మోవియిచ్చి మనసు గరఁచి యిట్టే
కాఁగిలి చనియ నీకుఁ గప్పెఁ బయ్యెద
వీఁగక శ్రీవేంకటేశ వెలఁదిఁ గూడితివిట్టె
రాఁగి వయసుదనియ రతికేలిసేసెను. ॥ అన్ని ॥ ౮

శుద్ధవసంతం

అలమేలుమంగ యీకె అనుకవద్దనుండది
చెలరేఁగి కందువలు చిత్తగించవయ్యా ॥ పల్లవి ॥

తరుణిదేహమే నీకు తగుదివ్యరథము
గరుడధ్వజంబాపె కప్పుపయ్యెద
తురగములు రతులఁ దోలెడు కోరికెలు
సరినెక్కి వలపులు జయించవయ్యా ॥ అల ॥

దిండు కలపిఱుఁదులు తేరు బండికండ్లు
అండనే పువ్వులగుత్తులాపెచన్నులు
కొండవంటి శృంగారము కోపునఁగల సొబగు
నిండుకొని దిక్కులెల్లా నీవేగెలువవయ్యా ॥ అల ॥

వెలఁదికంఠము నీకు విజయశంఖమదిగో
నిలువెల్ల సాధనాలు నీకునాపె
యెలమి శ్రీవేంకటేశ యిద్దరునుఁ గూడితిరి
పలుజయముల నిట్టే పరగవయ్యా. ॥ అల ॥ ౯

16—వ రేకు గౌళ

ఏమిచూచేవు మాదిక్కు యివియేమేలు
నీమనసే యెఱుఁగును నీవు సేసేమేలు ॥ పల్లవి ॥

మాటకుమాటాడఁబోతే మరియెన్నైనాఁ గలవు
మోటుపెట్టి నేము నీకు మొక్కేదే మేలు
పాటించి సతులకెల్లా పైఁడికొంగువరచిన
మేటివి నిన్నెందుకైనా మెచ్చేదే మేలు ॥ ఏమి ॥

చేతకుఁజేత నేసితేఁ జిక్కితెన్నైనాఁ గలవు
నాఁతినింతే నిలుచుండి నవ్వేదేమేలు
కాఁతాళించి చెలులకే గద్దెవెట్టితివురము
పూఁతవలపులనిన్నుఁ బొగడేదే మేలు. ॥ ఏమి ॥

నేసకును నేసచల్లఁ జేయికిఁ జేయి గలదు
పోసరించి నీకాఁగిటఁ బొందేదే మేలు
ఆసల శ్రీవేంకటేశ అలమేల్మంగను నేను
మోసపోక కూడితిమి మోహములే మేలు. ॥ ఏమి ॥ 91

వరాళి

ఎన్నఁడూనెరఁగమయ్య యిటువంటి పనులు
నిన్ననాపెఁ గంటిమయ్య నేరుపులపొగుల ॥ పల్లవి ॥

నిన్నుఁజూచి వడదేరీ నెలఁత అల్లంతనుండి
కన్నులనే వలపులు కాచుకున్నవో
పన్నిన సిగ్గులువీడఁ బయ్యద జారఁగఁదోసె
చన్నులనే జవ్వనము సాదించీనో ॥ విన్న ॥

ఘాతలనె చెనకీని కాంత నీమోము చూచి
చేతులనె తమకము చిమ్మిరేఁగీనో
కాతరాన నీగుణాలు కడుఁగడుఁ గొసరీని
దూతికెవలెనే మాట దొమ్మినేసీనో ॥ విన్న ॥

అక్కుపైనిలిచి కూడె నలమేలుమంగ నిన్ను
చక్కఁదనమెల్ల నీకు సంచమాయనో
గక్కన శ్రీవేంకటేశ కాయముఁ గాయమునంటె
పెక్కువ సింగారాలు పెనఁబెట్టెనో. ॥ విన్న ॥ 92

దేసాళం

అన్నేసి నాకునాకే ఆడుకోరాదు
యెన్నుకొమ్మి నామాటలిత వైనయపుడు ॥ పల్లవి ॥

అలుకలు దీర్చితివి ఆయములంటితివి
చెలఁగి నీచెప్పినట్టు సేసేమయ్యా
చెలపట్టేవేళగాదు సరిదాఁకీనిటమీఁద
తలఁచుకో నామాఁట తతి వచ్చినపుడు ॥ అన్నే॥

చేయి మీఁదవేసితివి సిగ్గులెల్లాఁ బాపితివి
ఆయనాయ నీకునడ్డమాడనయ్యా
రాయడించే చోటుగాదు రతికెక్కినపుడైనా
చాయకుఁ దెచ్చుకో మాట చవులైనయపుడు ॥ అన్నే॥

కన్నులనే నవ్వితివి కాఁగిటఁ గూడితివి
మిన్నకైనా నిన్ను సారె మెచ్చేనయ్యా
అన్నిటా శ్రీవేంకటేశ అలమేల్మంగను నేను
వన్నెకుఁ దెచ్చుకో మాట వహికెక్కినపుడు. ॥ అన్నే ॥ 93

## సామంతం

అప్పటనుంటియుఁ జెప్పేవాసుద్దులు
అప్పుడే అన్నియువింటినాసుద్దులు ॥ పల్లవి॥

అంగడికెల్లానెక్కెను ఆసుద్దులు
అంగనలందరు విన్నారాసుద్దులు
అంగమా నాకాడుకోను ఆసుద్దులు నీకు
నంగదలన్నియుఁ బాపెనాసుద్దులు ॥ అప్ప ॥

ఆరితేరెనింతలోనే ఆసుద్దులు
ఆరచి కతలవంటివాసుద్దులు
అరఁగాఁ బండినపంటలాసుద్దులు
ఆరీతినే యియ్యకొంటినాసుద్దులు ॥ అప్ప ॥

అలుకలిన్నియుఁబాపె నాసుద్దులు
అలయని రతులలో నాసుద్దులు
అలమేల్మంగను నేను ఆసుద్దులు
అలమితి శ్రీవేంకటేశాసుద్దులు. ॥ అప్ప ॥ 94

## భైరవి

ఆతనివగలెరఁగరమ్మలాల
చేతులువట్టి బలిమిసేయకురే మీరు ॥ పల్లవి ॥

నిద్దిరించేనంటాను నెలఁతలరాకలకు
వొద్దికెఁగాచుక వున్నాఁ దూరకే తాను
వొద్దికి రమ్మనీనంటా వొడివట్టి తియ్యకురే
యిద్దరు చెలులున్నారు యెక్కడా నేను ॥ ఆత ॥

మోనానమండేనంటా ముచ్చటతోఁజెలులకు
ఆనుక పొంచుక వున్నాఁదక్కడఁదాను
ఆనవెట్టెనాతఁడంటానందరుఁబిలువకురే
లోననున్నవారికంటె గుట్టునేరుతునా ॥ ఆత ॥

చేసన్న సేసేనంటా నేమంతి బంతిని నన్ను
వేసె శ్రీవేంకటాద్రి గోవిందుఁడే తాను
నేసవెట్టి కూడినాఁడు చెరఁగు వట్టించకురే
బాసగొన్నవారికంటె బలువా నేను. ॥ ఆత ॥ 95

## ముఖారి

పువ్వుల వేసినవారిఁ బూఁపల వేతురటవే
నివ్వటిల్ల మీలోమాట నీవేయెఱఁగవా ॥ పల్లవి ॥

చేసన్న సేసినందుకు సెలవియ్యవలెఁగాక
మాసటీనివలె మారుమలయనేలె
ఆసపడ్డవేళ నీవు అంగీకరించకవుంటే
దోసమందురడినీవు తొల్లేయెఱఁగవా ॥ పువ్వు ॥

చెంతఁ గూచుండినందుకు నేసవెట్టవలెఁగాక
పంతగత్తెవలె మారుపలుకకువే
మంతనమైనవేళ మరఁగులు వెట్టితేను
జంతందురు లోకులజాడ నీవెఱఁగవా ॥ పువ్వు ॥

ఇట్టెకూడినందుకును యిచ్చగించవలెఁగాక
జట్టిబేరగానివలె సటలేఁటికే
గుట్టుతో శ్రీవేంకటేశుఁ గూడియుఁ గొసరితేను
దిట్టతనమందురు యీతెరఁగులెఱఁగవా. ॥ పువ్వు ॥

217—వ రేకు సామంతం

వెన్న చేఁతఁబట్టుకొని వేఁడనేలే నేతికి
కన్నుచూపుల నతని గంపఁగమ్మ నేరవా ॥ పల్లవి

చేరి చేయిచేఁత బట్టి సిగ్గున బాసదిగేవు
పోరచి నీవిభుఁడెందు వోయీనే యింక
సారెకు నీపయ్యదలో చన్నులు దాఁచినట్టు
తారసిల్లి రమణుని దాఁచనేరవా ॥ వెన్న

వొంటిఁ జిక్కించుక నీవు వొట్టు వెట్టుకొమ్మనేవు
దంటమై వేరొకతెను తగిలీనట్టే
గంటువేసి పోఁకముడి గట్టిగాఁ గట్టినయట్టు
వొంటిగాకుండా నాతని వొడిఁగట్టనేరవా ॥ వెన్న

మొక్కలానఁ గాఁగిలించి మోవిముద్రలు వెట్టేవు
వెక్కసా శ్రీవేంకటగోవిందుఁడు నీకు
వొక్కమాటే కంఠహారమురమునఁ గట్టినట్టు
చక్కని నీమేనితోడ జంటనేయ నేరవా. ॥ వెన్న ॥

సాళంగనాట

ఇద్దరూ సరిగెలువ నింతలోనే జూజమా
వొద్దికై వొకరొకరు వూరకుంట గాక ॥ పల్లవి

సలిగెమాటాడితేను సాదించేవారు గలరా
వొలుగులు వారఁగ నవ్వుదురుగాక
చెలిపంతమేమాడినా చెల్లించఁగవలదా
బలిమి నీవింతలోనే పచారించవలెనా ॥ ఇద్ది

కొంగువట్టి తీసితేను కోపగింతురాయేమి
అంగవించి అందుకు లోనౌదురుగాక
అంగనల చేఁతలకు అంగీకరించవలదా
సంగతితో నీరాజసము చూపవలెనా ॥ ఇద్ద ॥

అక్కున నిన్నదిమితే నప్పుడూ జంకింతురా
చెక్కు నొక్కి కరఁగి మెచ్చింతురుగాక
యెక్కువ శ్రీవేంకటేశ ఈపె నిన్నుఁ గూడెనిట్టె
పిక్కటిల్లు నీనేర్పులఁ బెనఁగఁగవలెనా. ॥ ఇద్ద ॥ 98

## లలిత

అన్నియుఁ దెలుసుకొందమాతఁడే వద్దనున్నాఁడు
మన్నన గనుకొందము మరవకురే ॥ పల్లవి ॥

మనసువచ్చినవారి మాటలే చవులుగాక
యెనయనివారితోడ నేఁటిసుద్దులు
చనవు దానిచ్చితేను సాదించ నేనేరనా
పనిగలయందాఁకాఁ బదరకురే ॥ అన్ని ॥

జోడుగూడినట్టి వారి చూపులే యింపులుగాక
యీడుగానివారికొసరెంతైనానేమే
వాడికగలయప్పుడు వంచు కొననేరనా
జాడకు వచ్చినదాఁకా చలమేఁటికే ॥ అన్ని ॥

రతిఁ గూడినట్టివారిరచనలే మెచ్చుగాక
కతలు చెప్పేటివారి గతులేఁటివే
యితవై శ్రీవేంకటేశుఁడింతలోనే నన్నుఁగూడె
తతివచ్చెనిఁకమీఁద తలవంచనేఁటికే. ॥ అన్ని ॥ 99

## శంకరాభరణం

నేరుచుకోవేనీవు నిక్కము దంటతనము
ఆరితేరితే నిన్ననటు రట్టుసేయఁడా ॥ పల్లవి ॥

చెక్కుచేతితోదనింకా సిగ్గువడేవు పతితో
మక్కువనేకతవేఁ మరఁగేఁటికే
పక్కనఁ గస్సైవుగాఁగా పాలార్చిఁ గాకతఁడు
వెక్కసపుఁ బ్రోదవైతే వెల్లవిరి సేయఁడా

నాలిసేసి పానుపుపై నవ్వులు నవ్వేవు నీవు
కోలుముంజైనమీఁదఁ గొంకనేఁటికే
పోలించి ముగ్ధవుగాఁగా పొదిగిఁగాకాతఁడు
ఆలరి గద్దరివైతే నాయాలు సోఁకించఁడా

పొంచినట్టి రతివేఁ బొమ్మల జంకించేవు
మంచమెక్కి వావులింకా మానవేఁటికే
అంచెనురమెక్కించెఁగా కలమేలుమంగవని
నించి శ్రీవేంకటేశుఁడు నీకంటె మించఁడా.

ముఖారి

వీఁపుగానరాఁగా వాఁగే విధమేఁటికే
తోపునూకుడిందునేది దొరసానివిపుడు

నీరాక గోరుకొని నిలుచున్నాఁడితఁడు
యీరీతినే వద్దనుండే నేల లోఁగేవే
పేరే నా వరుస గాక పెనఁగేటినారతులలో
దూరల్లా నీదేకాదా దొరసానివిపుడు

మాటలు నీవాడేవంటా మలసు కొన్నాఁడతఁడు
యేఁటికే నన్నుఁజూచి యేల లోఁగేవే
కూటమే నాదిగాక గురుతులు సోఁకించేటి
తూఁటరివి నీవుగావా దొరసానివిపుడు

సరినీవు చూపేవంటా సన్నలు సేసీ నతఁడు
యిరవై నేఁ దిట్టేనంటా నేల లోఁగేవే
అరిది శ్రీవేంకటేశుఁ డలమేలుమంగ నేను
తొరలఁ గూడితిమిదే దొరసానివిపుడు.

॥ వీఁపు ॥

## పాడి

ఏమని వూరడించేవో యింక నీచిత్తముకొద్ది
దామెన తిట్లతోడ తలవంచీనదివో ॥ పల్లవి ॥

చెలి నీను జేరవచ్చి చేతులెత్తి మొక్కగాను
చెలరేగి చన్నులపైఁ జేయి చాఁచేవు
వెలఁదితో నవ్వులకు వేళావేళలు లేవా
సెలవుల నవ్వులనె సిగ్గువడీనదివో ॥ ఏమని ॥

అంగన బాగాలిచ్చి ఆకు మడిచీయఁగాను
ఎంగిలి సేసేవు మోవి యిందరిలోన
సంగిలి సరసాలకు కొంతైనా మరఁగువద్దా
సంగతి గాదని నీతో సన్న సేసీనదివో ॥ ఏమని ॥

వుపిద పైపై నీకు వూడిగాలు సేయఁగాను
జవళిఁ బాదాలు చాఁచి సారె పంచేవు
కవగూడితివి శ్రీవేంకటేశ తగవే కదా
పవళించి యింకా నీతో పంతమాడీనదివో. ॥ ఏమని ॥ 102

18-వ రేకు దేవగాంధారి

బాపు బాపు యింకనాకుఁ బరిణామము
ఆపనులెల్లానావి అదియే నావలపు ॥ పల్లవి ॥

మంతనాన నీవు నాపె మాటలాడఁగాఁ జూచి
చింతలెల్లఁ బాసి యేక చిత్తమాయను
వంతులకు నే నీకు వలతునాపెకు నీవు
అంతకంటె వలతువు అదియే నావలపు ॥ బాపు ॥

చలివాసి యిద్దరును సరసమాడఁగఁ జూచి
బలిమి నాజన్మము సఫలమాయెను
అలరి నే నీకు లోను ఆపెకు నీవులోనై
అలవాటాయఁ గనక అదియే నావలపు ॥ బాపు ॥

హితవుగల సతికి యెరవరికము లేదు
పతిమాటే తనమాటై పరగుఁగాని
సతులెందరుండినాను చంచలము దోఁచదు
అతివరో నీకే కలవంతేసి బుద్ధులు

యిరవెరిఁగినకాంత యెదమాటలాడించదు
సరవి మాటాడుఁ బతిసముకానను
పరులవాదుకుఁ బోదు భయములేదేమిటాను
అరయ నీకే కలవంతేసి బుద్ధులు

నేరుపుగల మగువ నెరుసులకుఁ జొరదు
మేరమీరి రతులనే మెప్పించును
యీరీతి శ్రీవేంకటేశునిట్టే నీవు గూడితివి
ఆరితేరి నీకే కలవంతేసి బుద్ధులు.

శ్రీరాగం

ఏనాఁటికేనాడు యేమనేవు
నీ నాటకములెల్ల నీకేతెలుసును ॥ పల్లవి

దగ్గరి నీగుణములు తలపోయుచుండఁగాను
కగ్గి నీతో నెరపేటి గర్వమనేవు
సిగ్గువడి యప్పటిని చెక్కు చేతనుండఁగాను
అగ్గలమై చింతించే అలుకలనేవు ॥ ఏనా

పొదిగి నీచేఁతలెల్ల పొగడుతానుండఁగాను
వెదకి వెదకి యాదేవెంగమనేవు
నిదురకన్నులతోడ నిన్నుఁ గొంత చూడఁగాను
గుదిగుచ్చి కుమ్మరించే కోపమనేవు ॥ ఏనా

కలసి మెలసి నిన్నుఁ గాఁగిలించుకొనఁగాను
వెలసి పెనఁగి బిగిసితిననేవు
బలిమి శ్రీవేంకటేశ పైకొని కూడితి నన్ను
మలసి మెచ్చితే నిన్ను మతకమనేవు. ॥ ఏనా ॥ 10

ీవ రేకు మంగళకౌసిక

కందము విందము దన కతలెల్లాను
పందెమిదే జూజమిదే పలుమారు నేఁటికే ॥పల్లవి॥

మగనిముందరనే మాటలాడి నాపెతోను
జగడా లడుతురా సారెసారెకు
తెగువలేమి గల్లాను తెరమరఁగునఁ గాక
మొగము నద్దమునిదే ముందపెత్తు లేఁటికే ॥కంద॥

ఆతఁడు చూడఁగానే ఆయాలంటి ఆపెమీఁద
చేతులు చాఁపుదురా చెలరేఁగి
సీతులేమి యెంచినాను నిన్నమొన్ననేకాక
జీతమిదే కొలువిదే సిగ్గులిఁక నేఁటికే ॥కంద॥

శ్రీవేంకటేశుఁ బొత్తుల నేసవెట్టే ఆపెను
కావరించి జంకింతురా కనుసన్నల
యీవేళ నన్నుఁగూడె యీతఁడే నానాయకుఁడు
భావమిదే కాయమిదే పలుచేఁత లేఁటికే. ॥కంద॥ 109

లలిత

నీకు నవ్వులు రావటే నెలఁతల దిక్కుచూచి
దాకొని యింతట మమ్ము దయఁజూడరాదా ॥పల్లవి॥

నిండు రాజసముతోడ నీవాతని వద్దనుండి
యెండకన్ను నీడకన్ను నెరిఁగేవటే
వెండియు పతిఁబాసిన విరహపు సతులకు
దుండగపు తలపోఁత దొమ్మినేసుఁగాక ॥నీకు॥

మదనరాగముతోడ మగనికాఁగిటనుండి
యెదిటివారినినిన్ను నెరిఁగేవటే
అదనుగాచుక రతికాసపడే యింతులకు
చదురపు తమకము చండినేసుఁగాక ॥నీకు॥

శ్రీవేంకటేశ్వరుని చేతికి లోనునేనుక
మావంటివారి నీవు మరచేవటే
యీవేళనే మమ్మునిద్దరు మన్నించితిరి
కైవసపుమదములు కాణాచులౌఁగాక. ॥ నీకు ॥

దేసాక్షి

ఉపకారమింతేకాని వొరటుగాదు
కపటాలుమాని సతిఁగాఁగిలించవయ్యా ॥ పల్ల

మంకుగాదు చెలియ నీమనసు చూచేనంటా
వుంకువ సిగ్గులతోడ నూరకున్నది
సంకెగాదు నిన్నుఁ దనచన్నులు నాటించితేను
అంకెఁ సమ్మెలయ్యీనంటా నట్టె మూసెఁ బయ్యద ॥ ఉ

తిట్టుగాదు నీగుణము తెలుసుకొనవలసి
బెట్టీమాటలనిన్నుఁ బెదవులసు
అట్టునేయదాపె నిన్నాఁడిఁ బెనఁగకున్న
దిట్టతనము నేరక దిగేవంటాను ॥ ఉ

గబ్బితనములుగాదు కాఁగిలించి పట్టినిన్ను
తబ్బిబ్బుగాకుండ రతిఁదనిపేనంటా
అబ్బురపు శ్రీవేంకటాధిప నిన్నుఁగలసె
జొబ్బిలఁ బ్రేమము నీకుఁ జూపేనంటాను. ॥ ఉప ॥

నారణి

ఏలగదించుకొనేవు యెక్కడాలేనిసుద్దులు
తాలిమిఁ బానుపుచేరి తమకించరాదా ॥ పల్ల

జంకెనచూపులచేత చలివాపెఁగాకయింతి
కొంకుఁగొసరుల నిన్నుఁగోపగించునా
వంకల చంద్రుల నించి వాఁడివెట్టెఁగాకనీకు
కంకిగా రతులలో ఘాతసేసునా ॥ ప

నిట్టూర్పు గాలిచేత నిన్ను నేదదేర్చెఁగాక
ఇట్టిగాని వుంకించి కొసరవచ్చునా
బట్టబయలు మాటలపందిలిగాఁ బెట్టెఁగాక
నెట్టుకొన్న తిట్లతో నేరమెంచునా ॥ ఏల ॥

చిగురుఁజేతులచేత జిగిఁగాఁగిలించెఁగాక
వొగరుఁబంతాల నిన్ను వొరయించునా
అగపడి శ్రీవేంకటాధిప కూడితివిట్టే
మొగమోదెఁగాక నీకుమోవిగంటిసేసునా. ॥ ఏల ॥ 112

ధన్నాసి

నేనేల కాఁగిలించేను నెలఁతనెవ్వతెనైనా
కానుకలాయమోహము కదుమెచ్చవలదా

మచ్చరములెల్ల మానె మనసొక్కటాయ నాకు
లచ్చనలు నీమోవిపై లలినుండఁగా
చొచ్చి యధరామృతము సొమ్ము పదిలముగాను
పచ్చిముద్రలు వెట్టె నీపని మెచ్చవలదా ॥ నేనే ॥

చింతలిన్నియునుఁ బాసె నెలవుల నవ్వువచ్చె
పొంతనుండి నీలోనే బుసకొట్టఁగా
దొంతినున్న వలపులు తూరుపెత్తేవేళలకు
అంతలో పొలివారించె నది మెచ్చవలదా ॥ నేనే ॥

చేతికి లోనాయ రతి నేస పిడికిటనిండె
సీతల నన్ను శ్రీవేంకటేశ కూడఁగా
జాతితో నిద్దరమును చద్దికి వేఁడికిఁగాను
యేతులఁ దోడు గడించె నిది మెచ్చవలదా. ॥ నేనే ॥ 113

సాళంగనాట

ఇందరితో నేకతాలు యెందాఁకాను
మందలించి ఆతనికే మచ్చికలుచూపవే ॥ పల్లవి ॥

మోహమే నిజమైతే ముచ్చటలు నిజమే
సాహసము నిజమైతే జయమూ నిజమే
వూహాపోహలు సారె వువిదతో నేలే
కూహకములేల పతికొంగు వట్టి తియ్యవే ॥ ఇంద॥

నయములు గలితేను నవుపులుఁగలవే
ప్రియములు గలిగితే పిలుపులుఁ గలవే
దయవుట్టఁ జెప్పియంపే తగువిన్నపములేలే
నియతి నాతని నీలోనికిఁ దియ్యరాదా ॥ ఇంద॥

చనవులు దొరకితే సంతసాలు దొరకును
చెనకులు దొరకితే సిగ్గులు దొరకును
యెనసెను శ్రీవేంకటేశుఁడు నిన్నింతలోనే
చనుమొనలనొత్తి దాసలు గొనరాదా. ॥ ఇంద॥ 114

220-వ రేకు శంకరాభరణం

ఏల పెనఁగేవునాతో నిట్టె విన్నవించుమని
వేళలెరఁగక నీతో వివరించఁగాని ॥ పల్లవి ॥

ఆయాలు సోఁకిన మాటలవియే యితవుగాక
చాయపాటైనవెల్లా చవివుట్టీనా
నీయెడ కాపె నేరుచు నేనూఁగొంతనేరుతు
వేయైనా నీవడుగక వెళ్లనాడఁగాని ॥ ఏల ॥

సొలసి సొలసి చూచే చూపులే వేడుకగాక
అలవోకలవి యెల్లా నాసరేఁచీనా
అలరి నిన్నాపె చూచు నావెనుక నేనుఁజూతు
బలిమి దెలియక నేఁ బచరించఁగాని ॥ ఏల ॥

గక్కనఁ గూడినయట్టి కలయికే మేలుగాక
తక్కక పెనఁగినవి తమినించీనా
యిక్కువ శ్రీవేంకటేశ యిద్దరము గూడితిమి
చెక్కులు నొక్కక నీపై చెయి వాఁచఁగాని. ॥ ఏల ॥ 115

## రామక్రియ

మాకేమి బుద్ధి చెప్పేవు మాటి మాటికి
  జోకలతో నీవాపెకు చుట్టమవే కావా ॥ పల్లవి ॥

మక్కువ గలవాఁడవు మానిని వేఁడుకోరాదా
  చెక్కుచేతితోడ లోనఁ జింతించీని
  యెక్కువ తక్కువ మాటలిద్దరము నాడుకొంటే
  చొక్కముగా నీవాపెకు చుట్టమవే కావా ॥ మాకే ॥

నగవులవాఁడవు నవ్వించరాదా ఆపెను
  వగ విరహానఁ దలవంచు కున్నది
  యెగసక్యాలు మాలోనెటువలెనుండినాను
  సొగసి నీవాపెకు చుట్టమవే కావా ॥ మాకే ॥

అట్టె చెనకేవాఁడవాపె చెక్కు నొక్కరాదా
  దట్టపు నీరతిఁగూడి దగ్గరున్నది
  గుట్టున శ్రీవేంకటేశ కోరినన్నుఁ గూడితివి
  చుట్టిచుట్టి తొల్లేపెకు చుట్టమవే కావా. ॥ మాకే ॥ 116

## ముఖారి

అంతదాననా నేను ఆనవెట్టఁదగుదునా
  వింతవలపులు నాపై వేసితివి చాలదా ॥ పల్లవి ॥

వద్దనుండి మొక్కించేవు వనితలచే మొక్కులు
  బద్దులు నీవి చాలవా పలుమారును
  వొద్దికె నప్పటిఁగొన్ని వుపచారాలు వలెనా
  తిద్దుబడి నోరుచుకో తిద్దితివి చాలదా ॥ అంత ॥

చెలులచే సారెసారె చేయివట్టి తీయించేవు
  చలమునీది చాలదా సాదించను
  మలసి మావల్లనీకు మందెమేళాలువలెనా
  నిలువెల్లాఁ దరితీపే నించితివి చాలదా ॥ అంత ॥

అప్పై తెరవేయించేవు అందవారి చేతనెల్ల
రట్టులునివి చాలవా రాఁపుసేయను
దిట్టవై శ్రీవేంకటేశ తిరమై కలసితివి
మెట్టి పట్టుకొని నన్ను మించితివి చాలదా. ॥ అంత ॥

కాంభోది

కొంత వోరచుకోరాదా కోపగించేమా
బంతినున్న మాగోరు బారచాఁచీనా ॥ పల్లవి ॥
పంతానకే పెనఁగేము పైపై నూరకే నిన్ను
చెంతనుండి యేమైనాఁ జేయవచ్చేమా
వంతులకే సొలసేము వారివీరివలె మరి
దొంతిఁబెట్టి వలపుల దొమ్మి సేసేమా ॥ కొంత ॥
ఆసలకే పిలిచేము అప్పటి నిన్నిందులోనే
వాసగొని నీకొంగు పట్టుకుందేమా
వాసులకే నవ్వేము వన్నెల నీమేనుచూచి
వేసాలంటా నిన్ను నిట్టే వెంగెమాడేమా ॥ కొంత ॥
సిగ్గులకే లోఁగేము చిత్తడి చెమటలను
కగ్గువెట్టికొని నిన్నుఁ గాఁకరేఁచేమా
నిగ్గుల శ్రీవేంకటేశ నీవెనన్నుఁ గూడితివి
దగ్గరి వుండినదాన తడఁబడేనా. ॥ కొంత ॥

నాదరామక్రియ

ఆతని భ్రమయించే (చవే?) వే అందనున్నాఁడు
యేతులునెమ్మెలుఁ జూపేవిప్పుడే మాతోనా ॥ పల్లవి ॥
చన్నులు ఘనములైతే సాధించవే రమణుని
కన్నులు ఘనములైతే కాఁడి పారఁ జూడవే
యెన్న నీసింగారాలు యెవ్వరికిఁ జూపేవు
పన్నిన సవతినింతే పగటు మాతోనా ॥ ఆతని ॥

వలపు చిత్తాననుంటే వంచుకోవే నీవిభుని
పలుకుల నేర్పులుంటేఁ బచరించవే
సొలపుల నీనటన చూచేవారిందెవ్వరే
చెలిమికత్తెలమింతే చేఁతలు మాతోనా ॥ ఆతని ॥

సిగ్గులు నెలవినుంటే శ్రీవేంకటేశు ముంచవే
నిగ్గులు చెక్కులనుంటే నీటు చూపవే
యెగ్గులేక ఆతఁడే యిద్దరినేలెను నేఁడు
వెగ్గళించి మురిసేటి వింతలు మాతోనా. ॥ ఆతని ॥ 119

సామంతం

ఇంతా నీచిత్తము యేమనే నిన్ను
అంకెకు రావు సిగ్గులు ఆఅడాయ వలపు ॥ పల్లవి ॥

చలము సాదించరాదు చనువు మెరయరాదు
పిలిచి చన్నులంటేవు ప్రియముతోడ
కలకల నవ్వేవు కప్పురము చల్లేవు
చలివాయవు సిగ్గులు చండిపడె వలపు ॥ ఇంకా ॥

పేరుకొని దూరరాదు పెనఁగి మొక్కఁగరాదు
నారువోసేవు నామీఁద నయగారాలు
మేరమీరి చెనకేవు మెచ్చి విడెమిచ్చేవు
తీరవెంతైనా సిగ్గులు దిమ్మరేఁగె వలపు ॥ ఇంకా ॥

గక్కన జంకించరాదు కాయము మరవరాదు
యెక్కువ శ్రీవేంకటేశ యిట్టె కూడితి
దక్కి నాకు లోఁగేవు తనువెల్ల నిమిరేవు
తక్కువగావు సిగ్గులు తతిగొనె వలపు. ॥ ఇంకా ॥ 120

221-వ రేకు

నిన్నటినుండిఁ జూచేను నీసరితలు
యెన్నికెకెక్కెదెట్లో యిందరిలో నేను ॥ పల్లవి ॥

చెంతలఁ జేరినవారిని చెక్కులు నొక్కేవు
అంతనింతానుండ వారినాదరించేవు
వొంతులు వెరిగి గొల్లదోమటాయ వలపు
యెంతటి దాననయ్యేనో యిందరిలో నేను ॥ విన్న॥

మాటలాడినవారిని మనసులు గరఁచేవు
సూటిఁ జూచినవారినిఁ జొక్కించేవు
వాటమై వరత వచ్చె వనితల కోరికలు
యీటు వెట్టుకొన నేను యెవ్వరిఁ బోలుదును ॥ విన్న॥

కూడిన కాఁగిటివారి కొప్పులు దువ్వేవు
మేడెపు రతులవారి మెప్పించేవు
వాడుదేరె జవ్వనాలు వంతుల శ్రీవేంకటేశ
యీడ నన్నుఁ గూడితివి యెంతభాగ్యమోనాది. ॥ విన్న॥ 121

మధ్యమావతి

ఇంకనేఁటి విచారాలు యెందాఁకారా
లంకెపాటు తమకాలు లావుసేసెఁ గదరా ॥ పల్లవి ॥

పట్టరాదు నీవయసు పాయరాదు నీపొందు
యెట్టూననరాదు నిన్ను నేమి సేతురా
గుట్టువేఁచె మదనుఁడు గుమిగట్టెఁ గోరికలు
అట్టయితి నీచేఁతలాఁటదికెక్కెఁ గదరా ॥ ఇంక ॥

చెప్పరాదు నీమనసు చింపరాదు నీవలపు
యెప్పుడూ నేనొక్కజోడె యేమిసేతురా
చొప్పులెత్తె పువ్వుటమ్ము సోలినిండెఁ బులకలు
దప్పిగొంటి నీసుద్దుల తతి వచ్చెఁగదరా ॥ ఇంకా ॥

తుంచరాదు నీమదము దొబ్బరావు దినములు
యించుకంతె నాసిగ్గు యేమిసేతురా
కొంచక శ్రీవేంకటేశ కూడితివి నన్నునిట్టె
పంచల నీమన్ననలు పాటమాయఁ గదరా. ॥ ఇంక ॥ 122

## పాడి

లేలే యెక్కడిసుద్ది లేమమాట వినవయ్య
నాలితో రుక్మిణిఁ దెచ్చేనాఁడు లేదా నీకు ॥ పల్లవి ॥

చెలి నిన్నుఁ బిలువఁగ చెయివట్టి తియ్యఁగాను
నెలవి నవ్వులతోడ సిగ్గువడేవు
కొలఁదిమీరనీబుద్ది కొలనిలో గొల్లెతల
నలుగడఁ బైకొనేటినాఁడు లేదా నీకు ॥ లేలే ॥

పడతి మోవియ్యఁగాను బలిమి గోరనంటఁగ
అడరి తప్పించుకొనేవప్పటి నీవు
కడఁగి పదారువేలు కాఁగలించుకొనఁగాను
నడుమనే యీబుద్ది నాఁడు లేదా నీకు ॥ లేలే ॥

కొమ్మ నినుఁ గూడఁగాను కుచముల నొత్తఁగాను
దొమ్మి శ్రీవేంకటేశ యింత నలసేవు
యెమ్మెల భువియు సిరి (యు?) యిరువంకఁ బెండ్లాడఁగ
నమ్మికతో యీబుద్ది నాఁడు లేదా నీకు. ॥ లేలే ॥ 123

## వరాళి

ఇందవయ్య వీడెమిఁక నెరవులేవి
సందులేని కూరిమికి జగడమువేవి ॥ పల్లవి ॥

చిత్తములేకములైతే సిగ్గులెందు వెదకేది
కొత్తవలపులైతేను కొంకఁ జూపేది
పొత్తుల భోగములైతే పొద్దులు దెలియనేది
అత్తిన సంసారఫలమయి వుండుఁగాక ॥ ఇంద ॥

వాడికెలు గలిగితే వంచన సోదించనేది
వేడుకలు మించితేను వెలువలేవి
ఆడుకోలు మాటలకు నవుగాములు మరియేవి
యీడనే జన్మఫలము లీడేరుఁ గాక ॥ ఇంద ॥

కూటములు గలిగితే గురుతులు వెట్టనేది
వాటపు నవ్వులకును వరుసేది
మేటి శ్రీవేంకటేశుఁడ మించి నన్నుఁ గూడితివి
పాటించి జవ్వన భాగ్యఫలమంటుఁ గాక. ॥ ఇంద ॥

శుద్ధవసంతం

ఇద్దరుఁ గదిసి కొంకనిఁక నేఁటికే
చద్దివేఁడి సరసాలు సరిచూడరాదా ॥ పల్ల
కదలించేవవునవునే గక్కున విభునితోడ
పెదవిమరఁగునవె పెనుమాటలు
వుదుటుఁ దమకమున నోపిక కలిగితేను
యెదుటి మరుసామున కియ్యకొనరాదా ॥ ఇ
పన్ని వేసే వవునవునే పంరి యాతని మీఁద
కన్నురెప్ప మరఁగుల కామబాణాలు
సన్నల మీలోనింత చనవులు గలిగితే
నున్నతపు రతికేలి నొరయఁగ రాదా ॥ ఇ
నెట్టన నొత్తేవేమే నీవు శ్రీవేంకటేశ్వరు
పుట్టిన పయ్యదమాటు పూబంతుల
అట్టుగాఁ గూడితివి మీఱఁగ రాజసము మించి
తొట్టిన మదములను దొమ్మి సేయరాదా. ॥ ఇద్ద ॥

కన్నడగౌళ

దిట్టనా నేనంత యేమి దేవరవన్నిటా నీవు
యెట్టైనా నెగ్గులెంచక యీడేర్చుమీ ॥ పల్ల
నయగారి మాటలెల్ల నమ్మితిఁ గనక యిట్టే
భయము విడిచినీతోఁ బలికే నేను
దయగలవు గనక తడఁబడక యేపొద్దు
ప్రియములు చెప్పి నిన్నుఁ బిలిచే నేను ॥ దిట

ముంచిన నీచేఁతలకు మోహించిన దాననై
పొంచి వూడిగేలు సేసి పొలసే నేను
కంచముపొత్తువాఁడవు గనక నీపాదాలకు
వంచనలేక యేల వడిమొక్కే నేను ॥ దిట్ట ॥
కూడిన వాఁడవు గాన కొంకక శ్రీవేంకటేశ
వేడుక నీతో నవ్వి వెలసే నేను
యీడు లేక మన్నించితి విట్టుకొంటి నన్నిటికి
పాడితో నీయిచ్చకానఁ బరగితి నేను. ॥ దిట్ట ॥ 126

2-వ రేకు కేదారగౌళ

ఏమి నేరుచు కొంటివింతేసి నీవు
కామిను లీసుద్దివింటే కాఁకనిన్ను రేఁచరా ॥ పల్లవి ॥
కలసి మెలసి యిట్టే కాంత నిన్ను వేఁడుకోఁగా
అలసి వున్నాఁడనంటా నట్టె పీఁగేవు
వలచిన సతి గాఁగా వడిఁ గిందుపడెఁ గాక
పెలుచు వేరొక్కతయితే పెను అట్టుసేయదా ॥ ఏమి ॥
యిచ్చకములే సేసి యింతి నిన్నుఁ జెనకఁగా
కొచ్చుకుమీ మేనంటా గుట్టు సేసేవు
నిచ్చ నీదేవులు గాఁగా నేరమెంచదాయఁ గాక
పచ్చిగా వేరొక్కతైతే బలిమెల్లాఁ జూపదా ॥ ఏమి ॥
కందువకు నిన్నుఁ బిలిచి కలికి నిన్నుఁ గూడఁగా
అందముగాఁ బరవశమైతిననేవు
యిందునె శ్రీవేంకటేశ యీకె నీవు గాఁగాఁ గాక
సందడి వేరొక్కతైతే చనవు మెరయదా. ॥ ఏమి ॥ 127

ఛాయానాట

ఆఁడుజాతెల్లానొక్కటే అందరికి నొక్కచాలే
వాఁడి తనగోరే అయితే వద్దనేవారెవ్వరు ॥ పల్లవి ॥

సిగ్గువడ్డ నిన్నుఁ జూచి చిత్తమెల్లా నీరాయ
అగ్గలమై నిన్ను నాదే యాపె మాటకు
కగ్గుదేర నీవు మున్ను కట్టుకొన్న బయిరూపము
వొగ్గి ఆడక పోవునా వోరుచుకో యిఁకను ॥ ఆఁడు

తలవంచే నిన్నుఁ జూచి దైలువారె నాచెమట
చెలరేఁగి ఆపె నిన్నుఁ జేసేచేఁతకు
యెలమి నీవేడుకకు యెత్తుకొన్న యెత్తుకోలు
తెలిసిన వాఁడవిఁక దించవచ్చునా ॥ ఆఁడు

తేలగిలే నిన్నుఁ జూచి తెలివొందె నామొగము
కోలుముందై ఆపె నిన్నుఁ గూడఁగాను
యీలీల శ్రీవేంకటేశ యిటు నన్నుఁ గూడితివి
వేళకు వచ్చిన మేలు విడువఁగ వచ్చునా. ॥ఆఁడు॥ 12

పాడి

రారే యింకానతని రవ్వసేతురా
ధీరుఁడై నవానినంత తెమలించవచ్చునా ॥ పల్లవి

నయగారి వానికిఁ గా నంటుతోడి సరసాలు
ప్రియునికిఁ గా మంచిప్రేమమెల్లాను
క్రియ గలవానికిఁ గా క్రిందిమీఁది విచారాలు
భయము లేనివానికి పట్టినదే పంతము ॥ రారే

ఆసగలవానికిఁ గా అందరితో వినయాలు
బాసగల వానికిఁ గా పాలకూళ్ళు
వేసరని వానికిఁ గా విచ్చనవిడి నవ్వులు
దోసమొల్లనివానికి తోఁచినదే హితవు ॥ రారే

పనిగల వానికిఁ గా పైపై తమకములు
యెనసిన వానికిఁ గా యేకాంతాలు
ఘన శ్రీవేంకటేశుఁడు గలసె నన్నింతలోనే
యెనలేక యీతనికి యెక్కినదే వయసు. ॥ రారే॥ 12

గౌళ

ఏలయ్య యింతేసి మమ్ము యిటు రట్టుసేసేవు
తాలిమితోడుత నీదయలోనివారము ॥ పల్లవి ॥

కసుఁగొన చూపులనే కరఁగించితివనేవు
వినయాలు చెప్పనీకు వింతవారమా
పెనఁగి మోవితేనెల పిలిచి విందువెట్టేవు
వెనకా ముందరా నీకు వినయాలవారమా ॥ ఏల ॥

సరుగ మంచముపైనాసలఁ గూచుండుమనేవు
సరుసకు రాను నీసరివారమా
యెరవుసేయక మాతో నేకతములాడేవు
అరసి నీకు బుద్ధిచెప్పేయంతేసివారమా ॥ ఏల ॥

కలసిన రతులెల్లా ఘనముగాఁ బొగడేవు
తొలుతనే నీకంటె దొడ్డవారమా
చెలఁగి శ్రీవేంకటేశ చేకొని కూడితివిట్టే
పొలసిన నీవంటి పోలికలవారమా. ॥ ఏల ॥ 130

సాళంగనాట

పొంచి యేమి నేసినాను పుచ్చకాయలోర్చుఁ గాక
యెంచి వేలఁజూపితేను యితరములోర్చునా ॥ పల్లవి ॥

కన్నుల నొకతె నిన్ను కాఁతాళించి తిట్టితేను
వెన్నెలరేకు నవ్వులు వెదచల్లేవు
నిన్నువంటిచేఁతలు నేఁడు మాకు నున్నవా
వెన్నదీసినట్టి చల్ల వేఁడనెట్టివారము (?) ॥ పొంచి ॥

పొలసి సిగ్గుననాపె బొమ్మల నదలించితే
చెలరేఁగి చెలరేఁగి చెక్కునొక్కేవు
తలఁపులో నీవలె తాలిమి మాకున్నదా
వొలిసి యీలకూరకు నుప్పదిగేవారము ॥ పొంచి ॥

కదు వాఁడికుచములఁ గాఁగిలించి వొత్తితేను
జడియక ఆపెకట్టే సంతసించేవు
కడఁగి శ్రీవేంకటేశ కలసితివిఁక నేము
వడియని మోవితేనె వారవట్టువారము. ॥ పొంచి ॥ 1

ముఖారి

అడుగరే చెలులాల అంతేసి నేనెరఁగ
బడివాయఁడాసలకో పంతాలకునో ॥ పల్లవి

నగవొక్కటేకాని ననిచి రెంటికి వచ్చు
జగడానకో లోలో సరసానకో
తగినట్టి బలుదొర తానేల మొక్కీనే
మొగసక్యాలకో మరి యింపులకునో ॥ అడు

పిలుపొకటేకాని పెనఁగ రెంటికి వచ్చు
వలపులకో వట్టి వారకానకో
వెలలేని నేరుపరి వేఁడుకొననింత యాలే
తలఁపు దెలుసుకోనో దంటతనమో ॥ ॥అడు

కూడినదొక్కటే కాని గురుతు రెంటికి వచ్చు
వేడుకలకో రతివేసాలకో
యీడనే శ్రీవేంకటేశుఁ డిన్నిటా నన్నునేలె
వాడికలకో నిందువహి కెక్కనో. ॥ అడు ॥ 1

223-వ రేకు భైరవి

వలపుపచారాల వనితలము
వులుగులిగెత్తఁగాను (?) వోపుదువా నీవు ॥ పల్లవి

నగవులే తెలుపులు నవ్వులలో సుద్దులయితే
పగటు మీరఁగనట్టే పంచవన్నెలు
చిగురుటధరమున చిందఁజొచ్చె నింతలోనే
వొగరువేసునో యేమో వోపుదువా నీవు ॥ వల

మాటలే తేనెలు మాటలలో తేటలయితే
గాటమైన మిరియాలకంటెఁ గారాలు
వాటమై నాలికమీఁద వడిగొని వచ్చినవి
వూటలైన యీ యెంగిలికోపుదువా నీవు ॥ వలపు ॥

కలయికలే చల్లన కలయికలలోపల
వెలలేని రతులెల్లా వేఁడివేఁడ్లు
యెలమి శ్రీవేంకటేశ యెనసితివి మాచేతి
వులివచ్చి చేఁతలకు నోపుదువా నీవు. ॥ వలపు ॥ 133

సామంతం

నీకే తెలుసునాపెకు నీకంటెఁ దెలుసు
వాకు నిష్ఠూరాల మీలో వంతువెట్టేవారమా ॥ పల్లవి ॥

సందడించి నీపయినింతి సణఁగులు చల్లఁగాను
విందువలె నీ వాపెను వేఁడుకోఁగాను
కందువచూడఁ గన్నులు గలవారమింతే నేము
చెంది మీతో సాకిర్లు చెప్పేటివారమా ॥ నీకే ॥

పంతమాడి నీకు చెలి పగటులు చూపఁగాను
యెంతకైనా నీవాపెతో నియ్యకోఁగాను
సంతలోని పనివలె సమ్మతించేవారమింతే
బంతిఁబెట్టి మిమ్ము నొడఁబరచేవారమా ॥ నీకే ॥

కాయమిచ్చి సతి నిన్ను కాఁగిటఁ గూడఁగాను
నీయంత శ్రీవేంకటేశ నీవు మెచ్చఁగా
పాయపు వలపు తొల్లే పాలువట్టేవారమింతే
నాయములు చెప్పి మిమ్ము నవ్వేటివారమా. ॥ నీకే ॥ 134

మాళవి గౌళ

విభుఁడు నీపై భక్తితో వీఁడె వున్నాఁడు
సభలో మాకెల్లా నీవు చనవియ్యవమ్మా ॥ పల్లవి ॥

చలము సాదించఁగాను జగడాలు దిద్దరాదు
నలువంకఁ దగవులే నడపవమ్మ
వెలయుచుఁ దిట్టఁగాను విన్నపాలు సేయరాదు
చలువైన శాంతానఁ జక్కఁగావమ్మా ॥ విభు

సమ్మతించననఁగాను సందడి మాటాడరాదు
నిమ్మపండంమకొంటే నీవే నేనమ్మా
యెమ్మెలు నెరపఁగాను యియ్యకోలు సేయరాదు
వుమ్మడి మీఁదపెత్తులు వూహించవమ్మా ॥ విభు

యింత సిగ్గువడఁగాను యెరుకలు సేయరాదు
వింతలు సేయక తెర వేయవమ్మ
చెంతలనే నిన్నుఁగూడె శ్రీవేంకటేశుఁడు లోలో
బంతినే మోవితీపులు పచారించవమ్మా. ॥ విభు ॥ 13

## లలిత

నాకే కాచుకుంటివా నడుమ నీవు
యీకతలెల్లా నేర్చి యెందు వోతివే ॥ పల్లవి

చెంతల నాతనిమాటే చెల్లఁబెట్ట వచ్చేవు
యెంత తగవరివే యేమే నీవు
పంతపురమణుఁడూర బావమై రాఁగాను
యింతేసి బుద్ధులు చెప్పకెందు వోతివే ॥ నాకే

కూడఁగట్టి నాలోనిగుట్టే అడిగేవు
యేడకేడ నీనేర్పులేమే నీవు
నీడనున్న రమణుని నిందలిందరాడఁగాను
యీడ నీవుత్తరాలాడకెందు వోతివే ॥ నాకే

కందువనాతని నన్నుఁ గాఁగిలించఁ జేసితివి
యిందుకా నీజాణతనాలేమే నీవు
అందపు శ్రీవెంకటేశుఁ డక్కడా నిక్కడా నేఁడు
యిందెను చేసిన చేఁతలెందు వోతివే. ॥ నాకే ॥ 13

## మంగళకౌశిక

కానవచ్చెఁ గదే మీకు కాంతలాల
నానిచ్చితేనే కొంత నయము వచ్చీని ॥ పల్లవి ॥

మనసులోపలి చింత మాటలోనే కానరాదా
మననేమి సోదించేవే మగఁడాతఁడు
కొనగొనలనే వద్ద గుట్టుననుండుటే మేలు
పనివడి పిసికితే పసురు వేసీని ॥ కాన ॥

ముంచిన వలపుతీపు మోవిమీఁదఁ గానరాదా
యెంచనేలే గుణాలు ప్రాణేశుఁ డాతఁడు
అంచలనిచ్చకమాడి ఆసలనుండుటే మేలు
కంచముపొత్తుకుఁబోతే కారాలు సోఁకీని ॥ కాన ॥

కాయము సోఁకినరతి కళలోఁ గానరాదా
యేయెడను శ్రీవేంకటేశుఁడాతఁడు
పాయక కూడెనితఁడు పంతముగొనుటే మేలు
వాయఁబోతే కొనగోరు వాఁటాలు నేసీని (?). ॥ కాన ॥ 137

## హిజ్జిజి

దానికేమి తప్పదింకా తానే నేను
కానుకలు పచరించ కాలమెల్లా వలెనా ॥ పల్లవి ॥

మాటలే మూటలాయ మంతనములాడఁగాను
యేఁటివే తనసుద్దులు యెందాఁకానే
పాటించి తా మగఁడైన ఫలమిది చాలదా
కూటమికిఁ గొసరఁగ కొలువులో వలెనా ॥ దాని ॥

చూపులే రూపులాయ చూడఁగాఁ జూడఁగాను
యేపునఁ దనయెమ్మెలు యెందాఁకానే
చేపట్టి తాఁ బెండ్లాడేచేఁత యిదే చాలదా
తీపులు పచరించను తెరలోనే వలెనా ॥ దాని ॥

నవ్వులే పువ్వులాయ నాపైఁ దనమోహమున
యెవ్వరు నెరఁగనివా యెందాఁకానే
రవ్వగాఁ గూడె శ్రీ వెంకటరాయఁడిది చాలదా
వువ్విళ్ళూర నన్ను నేయ వొద్దనిట్టె వలెనా. ॥ దాని ॥ 138

224-వ రేకు హిందోళవసంతం

చెల్లునయ్య నీవు నాకుఁ జేసే చేఁత
యెల్లవారిలోన నిది యెక్కుడా నాకు ॥ పల్లవి ॥

చనవిచ్చితివి నీవు చలము నే మానితి
వెనసి వేఁడుకొనేవు యెక్కుడా నాకు
పెనఁగితివిట్టె నేఁడు బిగువులు సడలితి
యెనుమారు పంతమిచ్చేవెక్కుడా నాకు ॥ చెల్లు ॥

పయ్యద నీవంటితివి పనులకు లోనైతి
యియ్యరాని దాసయిచ్చే వెక్కుడా నాకు
నెయ్యము పైవేసితివి నీవే నేనైయుంటి
యెయ్యెడ చూచినా నవ్వేవెక్కుడా నాకు ॥ చెల్లు ॥

కందువ దెలిపితివి కాఁగిలించుకొంటెనిన్ను
యిందరూ మెచ్చ మన్నించే వెక్కుడా నాకు
కందర్పగురుఁడ శ్రీ వెంకటరాయ కూడితివి
యిందూ నందూనేలితివెక్కుడా నాకు. ॥ చెల్లు ॥ 139

శంకరాభరణం

ఇద్దరూ నిద్దరే మనమేమి చెప్పేదే
బద్దుగా దాపెను మెచ్చేఁ బ్రహ్లాదవరదుఁడు ॥ పల్లవి ॥

చక్కని మొకముచూపి సారెసారె మాటలాడి
చిక్కించెనాపె తొలుత చేరియాతని
మిక్కిలి మేలుదియై మేను చెమరించఁగాను
పక్కన నాపెను నవ్వేఁ బ్రహ్లాదవరదుఁడు ॥ ఇద ॥

పీఁటమీఁదఁ గూచుండి ప్రియములు చెప్పి చెప్పి
మాఁటి చన్నులనొత్తెను తొలుతాతని
పాటించి యాతని మోవిపండు చూచి నోరూరఁగా
జాటగానాపెను నవ్వెఁ బ్రహ్లాదవరదుఁడు ॥ ఇద్ద ॥

కాఁగిలించుక యిందిర కన్నులవలపు చల్లి
ఆఁగెను శ్రీవేంకటేశు నౌభళాననను
వేఁగదేరఁ జొక్కియాపెఁ[1]జూచి అతఁడె తానై
పాఁగినరతుల నవ్వెఁ బ్రహ్లాదవరదుఁడు. ॥ ఇద్ద ॥ 140

సాళంగనాట

నచుమఁ జెమట భవనాశియేరు మీకునవ్వె
అదియాలముగ లోలోనందెఁగా మీవలపు ॥ పల్లవి ॥

యెదురుఁ గొండపైనెక్కి యిందిర నీపైఁగుచము
లెదురుచాఁచి వొత్తెనేదకు నేద
కదిసి శ్రీనరసింహ కాఁగలించితి వాపెను
అదన నిందుకు నందు నందెఁగా మీవలపు ॥ నదుమ ॥

యీదనుండి తన పాదమింతి నీతొడపైఁ జాఁచి
యీడుజోడుగాఁ గూచుండెనిచ్చ యెరిఁగి
వేడుక నీమోవినాపె విందుగా మోవంటితివి
ఆడానీడా దోఁటిగా నేఁడందెఁగా మీవలపు ॥ నదుమ ॥

నీనీడ ఆపెపైఁబారి నీపైనాపెనీడవారి
తానకమై రెంటా మీరు తగిలితిరి
పూని యహోబలమునఁ బొంచి శ్రీవెంకటేశుఁడ
ఆనకమై రెంటాఁ బెండ్లైయందెఁగామీవలపు. ॥ నదుమ ॥ 141

1. ఇందు యతిభంగము. లేక, 'చూచి' లోని చకారముతో యతి కలిపి తృప్తిపడవలెనా?

గౌళ

ఏమందునే వీనిమాయ లెన్నైనాఁ గలవు
కామించి నన్నునేలె కమ్మటీవి చూడరే ॥ పల్ల॥

కొప్పున రాలీ విరులు గురుతులు చూడరే
చిప్పిలీఁ జెమటలివె చేరిచూడరే
వుప్పతిల్లె పులకలనున్నాఁడు చూడరే
కప్పీఁ బచ్చడము నాకు కమ్మటీసిఁ జూడరే ॥ ఏమ॥

గందపుఁబేఁట్లు రాలీఁ గమ్మటీవిఁ జూడరే
చిందీ లేఁతనవ్వులు నెలవులఁ జూడరే
అందమైన బుసకొట్లవి గొన్నిజూడరే
ఆందుకొని నా చన్నులంతలోనే చూడరే ॥ ఏమం॥

వాడుమోవియును వింతవాసనలూఁ జూడరే
వేడుకకాఁడై వచ్చి వేఁడుకొనిఁ జూడరే
వీడెమిచ్చీఁ గోన తిరువెంగళేశుఁడై వచ్చి
కూడెను శ్రీ వెంకటాద్రి కొండమీఁదఁ జూడరే. ॥ ఏమం॥ ।

లలిత

వినవే విభునిమాట వింతదానవా
చెనకేటి వేళనింత సిగ్గులు వద్దురా ॥ పల్లప॥

యీసు లేని వాఁడతఁడు యిచ్చకురాలవు నీవు
తాసులవంటివే నీతలఁపు లెల్లా
నేస వెట్టినాఁడతఁడు చేయివట్టితివి నీవు
వాసులకు నీవుతల వంచుకొందురా ॥ వినవే ॥

సరసపు వాఁడతఁడు చాయకు వత్తువు నీవు
సరిబేసి వంటివే మీచనవులెల్లా
తెరవేసినాఁడతఁడు తిరమై నిలిచితివి
శిరసువంచుక నీవు చెక్కుచేతనుందురా ॥ వినవే ॥

శ్రీ వెంకటేశుఁడతఁడు శ్రీ మహాలక్ష్మివి నీవు
పూవు వాసనవంటివే బుద్ధులెల్లాను
భావించి కూడెనతఁడు పైకొంటి విట్టెనీవు
తావుల రతుల నిట్టే తమకింతురా. ॥ వినవే ॥ 143

కన్నడగౌళ

ఇంత సేసినవాఁడవు యిదిసేరవా
కాంత వున్నభావము కందువు రావయ్యా ॥ పల్లవి ॥

చెక్కుల లేఁతచిగురు చేతిలోఁ దామరపువ్వు
వొక్కపరే రెండూసబ్బెనువిదకును
యెక్కడయేసునో మరుఁడు యెవ్వరి మర్మమంటునో
చొక్కముగ నీసతిఁ జూతువు రావయ్యా ॥ ఇంత ॥

తెప్పల ముత్యాలవాన తేసులనే మెఱయిఁత
అప్పుడే రెండూఁ గలిగెనంగనకును
తప్పులెవ్వరివల్లనో దైవికమెట్టున్నదో
చొప్పులీ వనితవల్లఁ జూతువు రావయ్యా ॥ ఇంత ॥

చిత్తములో నీరూపు చింతలు నీమీఁదను
హత్తెను రెండూ నిట్టే అతివకును
కొత్తగా శ్రీ వెంకటేశ కూడితివింతక ముందు
జొత్తుల చెమటచెలిఁ జూతువు రావయ్యా. ॥ ఇంత ॥ 144

225-వ రేకు నాట

నీతోను సరి బొంక నేనోపను
కాతరించినట్టి నీకనుసన్నదానను ॥ పల్లవి ॥

చెక్కునొక్కి వేఁడుకొంటే నేదలెల్లాఁ దేరిచితి
మొక్కితిఁ జుమ్మీ నీకు మొన్న మొన్న నే
తక్కరివిద్యలుయేమీఁ దలఁచకుమీ అయ్య
చిక్కఁగా వలచిన నీచేతిలోనిదానను ॥ నీతో ॥

పాదములు పట్టుకొంటి పంతములు నీకిచ్చితి
ఆదిగాన నే నవ్వితి నప్పు నప్పుడే
కామగూడదనకుమీ కాఁకలు సేయకుమయ్య
యేదెసచూచినా నీకునింటిలోనిదానను

యిచ్చకములు సేసితినియ్యకొంటి నన్నిటికి
కొచ్చి శ్రీ వెంకటేశ నేఁగూడితి నేఁడే
పచ్చిసేఁతలెల్లాఁ జేసి పదరకుమీ అయ్య
నచ్చుపెట్టుక వుండే నీ కాఁగిటిలోదానను. ॥ నీతో ॥ 1[illegible]

రామక్రియ

ఊరకున్నదంటానేల వొరయఁగ వచ్చేవు
నేరుపులకెల్లానిది నెపమింతే కాక ॥ పల్లవి

పట్టరాదు ముట్టరాదు పడఁతుల మోహము
గుట్టుదెలిసినదాఁకా గురిగాదు
అట్టిదివి నిన్నాపె యాఁబడిసేయ నోపునా
పట్టిన వ్రతములోదిబలిమే కాక ॥ ఊర ॥

చెప్పరాదు చూపరాదు చెలుల కోరికలు
ముప్పిరి మాఁటాడుదాఁకా ముచ్చటాడదు
తప్పనివాఁడవు నీతో తారుకాణ కోపునా
తెప్పగా నీతో నవ్వేతెలివే కాక ॥ ఊర ॥

పాయరాదు తోయరాదు పడఁతుల సంగములు
చేయి మీఁదయినదాఁకా సిగ్గువద (వీడ?) దు
యీయెడ శ్రీవేంకటేశ యింతి నీవురాన నిల్చె
వాయకు గర్వించేదా సలిగింతే కాక. ॥ ఊర ॥ 1[illegible]

ఆహిరి

నే నేరుపవలెనా నెలఁతకు నివియల్లా
సానఁ బట్టుకోనేరదా సకియ నీమనసు ॥ పల్లవి

నవ్వులనే నీవింత నాలినేనేవాఁడవౌత
యెవ్వరు నెఱుఁగరా యెమ్మెలేఁటికి
నివ్వాఁల్లఁ గైలాటాలు నేఁ బెట్టితినవేవింత
జవ్వని యాపెఱఁగదా చల్లని నీగుణము ॥ నేనే ॥

ఱంకెననే నీవప్పటి సందుకొనేవాఁడవౌత
పొంకాన వచ్చేదేకాదా పొద్దువొద్దుకు
సంకెదీర నిన్నాపెతో జగడాలు వెట్టితినా
అంకెల నాపెఱఁగదా అచ్చపు నీసాజము ॥ నేనే ॥

కందువనింతులఁ జూచి కలసేటి వాఁడవౌత
చందమయ్యేకాదా (?) సారె సారెకు
పొందితి శ్రీవెంకటేశ పొరుగున మమ్మిద్దరి
ముందర నాపెఱఁగదా ముచ్చట నీవలపు. ॥ నేనే ॥ 147

బౌళిరామక్రియ

నేరుపరులకునెల్లా నీవు సేసినదే పాడి
ఆరయఁ గడపరాయ అంతవాఁడవౌదువు ॥ పల్లవి ॥

కందువమాటలనే కంకణాలు గట్టికట్టి
సందడిఁ బెండ్లాదేవు చతురుఁడవు
చందమామగుటుకల సారెనవ్వి వావులెల్లా
అందలానఁ బెట్టుకొంటి వంతవాఁడవౌదువు ॥ నేరు ॥

పోరచి మోవితేనెలు పొదిగి తోడంటువెట్టి
సారెకు విందువెట్టేవు చతురుఁడవు
కోరి నిన్నుఁ జూచితే నాకొనచూపుల ముత్యాల
హారాలుగా వేసుకొనే వంతవాఁడవౌదువు ॥ నేరు ॥

వొల్లనే చేతులు చాఁచి వుడివోని వలపులు
చల్లి వుంకువలిచ్చేవు చతురుఁడవు
యెల్లగా శ్రీవెంకటాద్రినెనసి నావిన్నపాలు
అల్లంతనే వింటివంతవాఁడవౌదువు. ॥ నేరు ॥ 148

ధన్నాశి

సాము సేతువుగా నీవు సరుస రాముఁడవై
యీమగువనేరుపులు యివి చూడరాదా

బొమ్మల విండ్లచేతఁ బూఁచి చూపుల యమ్ముల
కుమ్మరించి చెలి నీపై గురులేసీని
సమ్మతించి యిరువంక చన్నుల కాంతులు సారెఁ
జిమ్మి పయ్యెదలోఁ బుట్ట చెండ్లాడీని ॥ స

గక్కన విసకాండపు కరముల సన్నలను
అక్కజపు నీతోఁ గోలాటమాడీని
చెక్కుచెమట గోటిలఁ జిందకుండా మీఁటుచు
చక్క బిత్తటకొమ్ములు సాదించీని ॥ సా

చిగురుమోవిమాటల చేకత్తుల వంతాలఁ
దగిలి నీపైనాపె దండ వెట్టీని
నగుతా శ్రీవెంకటేశ నంటున నీవు గూడితి
అగపడి నీగరిడినన్నిటా మించీని. ॥ సాము ॥

ఆహిరి

ఏమయ్య యిందుకు నిన్నేమందును
కామించవలదా కైకొని నీవిపుడు ॥ పల్లవి

గాలించి గాలించి కలికి మాటలాడఁగా
లాలించవలదా లలనఁ గొంత
పోలించి పోలించి పొగడఁగా నప్పటిని
పాలించవలదా పయికొని నీవిపుడు

సోదించి సోదించి సుద్దుల నిన్ను మెచ్చఁగా
ఆదరించఁగ వద్దా అన్నిటా నీవు
సాదించి సాదించి సరి నీతో నవ్వఁగా
మోదించవలదా మొదల నీవిపుడు ॥ ఏమ

కరఁగించి కరఁగించి కాఁగిట నిన్నుఁ గూడఁగా
పొరయించవలదా పొందుల నేఁడు
సిరులుమింపఁగ మించ శ్రీవెంకటేశుఁడుగూడె (శుఁడకూడి?)
యిరువుకోవలదా యిచ్చకములిపుడు. ॥ ఏమి ॥ 150

226-వ రేకు మాళవిగౌళ

మాతోనింకానా మజ్జాతాయను మాకు (?)
చేతికి లోనై నమీఁదఁ జెప్పవలెనా ॥ పల్లవి ॥

అంగిలి సతుల నీవు సారెసారె నమ్మించఁగా
అంగడిఁ బడినవె నీ అన్నమాటలు
మెంగిలిగా నీమోవి యెవ్వరైనాఁ జేయఁగాను
ముంగిట మెరసెను నీముసిముసి నవ్వులు ॥ మాతో ॥

వేరి పదారువేలకు నేసలు నీవు వెట్టఁగా
ఆరీతిఁ బడెనవే నీ అన్నిచేఁతలు
కోరికలు మించినట్టి గొలనిసతులచేత
నీరువంక తుంగైనవి నీగుణాలు ॥ మాతో ॥

ఒంపుల రాచకూఁతురునెత్తుక నీవు రాఁగానే
సంపద మించినవి నీచతురతలు
ముంపున శ్రీవెంకటేశ ముందె నన్నుఁ గూడితివి
చెంపల నిలిచెను నీసిగ్గులెల్లాను. ॥ మాతో ॥ 151

భైరవి

చిత్తము రా సేవలెల్లఁ జేతువుగాక
కొత్తలా మీయిద్దరికిఁ గొంకనేలే యిఁకను ॥ పల్లవి ॥

నెలవి నవ్వునిండితే సిగ్గులేల పెంచేవే
నిలువున నవిరెండు నీవొళ్ళవే
వలపే పూవఁగాను వాసనలు మానునా
కొలువులో పతితోడఁ గొంకనేలే యిఁకను ॥ చిత్త ॥

తనువు చెమరించితే తలయాల దాఁచేవే
నినుపుననవి రెండు నీవొళ్ళివే
మనసు గరఁగఁగాను మచ్చికలు మానునా
కొనితెచ్చేవా బుద్ధి కొంకనేలే యింకను ॥ చిత్త
మఱపు పైకొంచేను మాటలేల కొదికేవే
నెఱతనాలవి రెండూ నీవొళ్ళివే
చిఱుతలమేలుమంగ శ్రీవెంకటేశుఁడు గూడె
గుఱియైన పనులకు కొంకనేలే యింకను. ॥ చిత్త ॥

శంకరాభరణం

నేఁడె సుక్కురారము నెలఁతలాల
పొడిమి సేవసేయరే పుణుఁగుకాపు ॥పల్లవి
పన్నీటి కాలువలు పారీనిఁజూడరే
అన్నిటాఁ గొండవంటి శ్రీహరిమీఁదను
యెన్ననభిషేకమంత్రాలివె చెప్పేరు వినరే
తిన్నని పుణుగుకాపు దేవునికి నేఁడు ॥ నేఁడె
రాలీని కప్పురరజమిదె చూడరే
నీలమేఘమువంటి యీ నీరజాక్షుపై
తాలిమితో జాలువారీ తట్టుపుణుఁగదిగోరే
పోలింపఁ బుణుఁగుకాపు పురుషోత్తమునికి ॥ నేఁడె
అలమేలు మంగతోడి హారాలు సేవించరే
వెలయ ధరించెను శ్రీవెంకటేశుఁడు
పలువిందులారగించె బాగాలు ముయ్యరే
చెలఁగీ పుణుఁగుకాపు శేషాద్రిపతికి. ॥ నేఁడె ॥ 159

సౌరాష్ట్రం

ఏఁటిదో నీచిత్తము నేమెఱఁగము
వాఁటమైన వెల్లవిరివారమయా ॥ పల్లవి ॥

సిగ్గువడితిమింతతో నెలవి నీవు నవ్వఁగా
యెగ్గొ తప్పొ యేమంటినో యెరఁగమయ్య
దగ్గరి సేవ సేసితి తగినదొరవు నీవు
నగ్గులఁ గుచ్చితములు నేఁయమయ్య ॥ ఏఁటి ॥

వెరగందితినింతలో వేఁడుకొనే నిన్నుఁజూచి
మెరఁగులిందేమున్నవో మొక్కేమయ్య
పరిసీకు లోనయితి మంచిదేవరవు నీవు
మెరసి నీతోఁ బెనఁగ మేము నేరమయ్య ॥ ఏఁటి ॥

చెమరించితిని నీవు చేరి నన్నుఁ గూడఁగాను
తమక నా తడఁబాటో తలఁచమయ్య
ఉమర శ్రీవెంకటేశ అలమేల్మంగను నేను
అమరిన రతిఁ ద్దమాదమయ్య. ॥ ఏఁటి ॥ 154

మేఁచబౌళి

నీవారమిన్ని నాను నీకంటెనెక్కుడు లేరు
సేవలు సేసేము నీవు చిత్తగించవయ్యా ॥ పల్లవి ॥

సేసినచేఁతలు నీవే చెల్లఁబెట్టుదువు గాక
యీసరి మానేరుపులు యేమున్నవి
సేసపెట్టి రాజు వలచినదే దేవులందురు
రాసికెక్క నీసొమ్ము రక్షించుకోవయ్యా ॥ నీవా ॥

పట్టిన నీపంతమే బలువు సేతువు గాక
యెట్టైన మాగుణములు యేమి చూచేవు
అట్టె పరుసమంటితేనదియే బంగారందురు
పెట్టని చోట్లఁ బెట్టి పెద్ద సెయ్యవయ్యా ॥ నీవా ॥

కూడిన నీకూటమికే గురులు సేతువు గాక
యీడనే మాయాసోదాలేమున్నవి
యేడను శ్రీవెంకటేశ యేలితేనే బంటందురు
పాడేటివారము నిన్ను బత్తి చేకోవయ్యా. ॥ నీవా ॥ 155

## ముఖారి

ఆయలవాడే చూచి అప్పటిమాతో నేఁడు
చాయలనీపనికెంత సాము సేసెనో ॥ పల్లి॥

వీడెమియ్యఁగలఁ గాక వీడెమిచ్చే చేతుల
తోడఁ దోసఁ బెనఁగఁగా దొబ్బఁగలనా
వోడక నిష్ఠూరానకొడిగట్టే పతులసుఁ
గూడి యేమి సేయించుకొని వచ్చెనో ॥ ఆయ॥

మాటలాడఁగలఁ గాక మంచితనమైన నోట
తేటగా నవ్వేటి తన్నుఁ దిట్టఁగలనా
సాటున రాఁగతనాలు నెరపేటి కాంతలను
పాటించి కలసి యేమి భ్రమసినాఁడో ॥ ఆయ॥

కాఁగిలించఁగలఁ గాక కైకొన్న చేతుల గోళ్ళ
చేఁగదేర మొక్కఁగాను చిమ్మఁగలనా
వీఁగక శ్రీవెంకటాద్రి విభుఁడిట్టె నన్నుఁ గూడె
యేఁగి వచ్చి యేయింతులకిట్టె పంతమిచ్చెనో. ॥ ఆయ ॥ 151

227-వ రేకు నాదరామక్రియ

ఎప్పుడును నీమనసు యెరఁగని కల్లరేదు
ముప్పిరిగొనేటి యీమోసమేలయ్యా ॥ పల్లవి ॥

వలపులు సరివచ్చె వనిత యిందుకు మెచ్చె
వెలిసేల లోనికిఁక విచ్చేయరాదా
యెలమి సరిబేసికి యిదె సుద్ది నిన్ననేల
నిలువు నివ్వెరగులు నీకేటియ్యా ॥ ఎప్ప ॥

మాటలు తారుకాణాయ మగువకుఁ బ్రియమాయ
మాటికి నవ్వఁగనేల మన్నించరాదా
తేటలుగా నీనిటాలే తెలిపెఁ జెలులకెల్ల
యీటుతోడి కుచ్చితాలు యిఁకనేలయ్యా ॥ ఎప్ప ॥

రతిఁ దమకము విందె రమణిభాగ్యము వందె
కతలేల పంతములు గైకొనరాదా
యితవై శ్రీవెంకటేశ యింతినిట్టె కూడితివి
మతకరి తరితీపు మరియేలయ్యా. ॥ ఎప్పు ॥ 157

కాంభోది

వట్టి పంతములనేల పసివాడువాడ నీకు
నెట్టన నీవాఁడనని నిలుచుండరాదా ॥ పల్లవి ॥
కలికిచూపులు నీకుఁ గలువరేకులెకాక
వెలినుండి యింతలోనే వెట్టలయ్యీనా
పొలసిన విరహానఁ బొరలేవు యీడనుండి
వలచి వచ్చితినంటా వద్దికి రారాదా ॥ వట్టి ॥
కామిని నవ్వులు నీకుఁ గప్పురవిడేలే కాక
చే ముంచి మరివేరే చేఁదయ్యీనా
ఆమని యాసలతోడ నసురుసురయ్యేవిట్టే
దోమటిమోవితేనెలు తొడుకఁగరాదా ॥ వట్టి ॥
కాంతమాటలు నీకుఁ గట్టిన ముదుపు గాక
చింతల నింతలోననే చిల్లరయ్యీనా
యింతట శ్రీవెంకటేశ యెనసితి విందునుండే
పొంతకు వచ్చినందుకు పూఁచి మొక్కరాదా. ॥ వట్టి ॥ 158

లలిత

ఎఱఁగమైతిమయ్య (మమ్మ?) యిన్నాళ్ళును
కలకరిఁ బెట్టఁగోరే కాతరీఁడా తాను ॥ పల్లవి ॥
పొందులిట్టే రేచఁగాను పొత్తులు వేడుకలాయ
సందదించఁగా వలపు చవులాయను
యిందాఁకాఁ దనమనసెవ్వరిదై వుండెనే
ముందు వెనక లెంచని మొక్కలీఁడా తాను ॥ ఎఱఁగ ॥

కాయము గిలిగించఁగా గక్కన నవ్వులు వుట్టె
  చేయి చేతనంటఁగాను చెమరించెను
  పాయపుమదమెవ్వలె పంచసుంచెనే యిన్నాళ్ళు
  చాయలు సన్నెరఁగని జిడ్డువాఁడా తాను
గక్కన నేఁగూడఁగాను కళలు మోమున నిండె
  నొక్కుచు మోవియ్యఁగాను నోరూరెను
  యిక్కువ శ్రీవెంకటేశుఁడెంత భ్రమసి వుండెనే
  మెక్కువ నాతోరమించె నిప్పుడుఁడా తాను. ॥ ఎఱఁగ

నాగవరాళి

ఇంటికి రావయ్యా యింకనేఁటికి
  కంటగింపఁ బొల్లింటికి తెచ్చేరేపు ॥ పల్లవి
మానరించి యెట్టుండినాఁ గము మంచివాఁడవే
  నీవేమేమాడినాను నిజమరిపే
  కైవసపు పసితలు కల్లలు గాదులు నిన్ను
  ఆవటించి పూరకైనా నాడుదురుగాని ॥ ఇంటి
నేనేటి నీచేఁతలెల్లా చేరువవున్నాలే
  నీ నుద్దులు విన్నవల్లా నీరిలోదివే
  పాసినట్టి మగువలు పట్టలేక వయసులు
  వేసరి నిన్నుఁ దిట్టుతా వీఁగుదురు గాని ॥ ఇంటి
కలసిన నీరతులు కందువ పుచితములే
  సులభాన నీవు నాకుఁ జుట్టమవే
  మెలమి శ్రీవెంకటేశ యెరవుల వనితలు
  చలమరివని నిన్ను సాదింతురు గాని. ॥ ఇంటి ॥

మేచబౌళి

ఎప్పుడు నీవు వచ్చినా నేమాయను చన
  విప్పించుకొనేఁగాక యేమాయను ॥ పల్లవి

కు సెలవైనదాన నీచేతిలోనిదాన
యేకడ నేనే నుండినాను యేమాయను
ఆకు మడిచిచ్చేదాన ఆయాలు సోఁకినదాన
యేకాలఁది నుండినాను యేమాయను ॥ ఎప్పుడు ॥

ంతువరుసల దాన వలచివుండిన దాన
యెంత విరహాన నున్నా నేమాయను
చింత నీకెక్కినదాన చిగురుఁగోరికదాన
యింత నీవు పెనఁగితే నేమాయను ॥ ఎప్పుడు ॥

మనసు నమ్మినదాన మానము నీకైనదాన
యెనసి నిన్ను మెచ్చితే నేమాయను
తనిసితి నీకూటమిఁ దగు శ్రీ వేంకటేశ్వర
యినుమడించి నవ్వితేనేమాయను. ॥ ఎప్పుడు ॥ 161

## ముఖారి

మిక్కిలి కళదేరేవు మేలుగా నీవు
చక్కని సరసానకు జాణవుగా నీవు ॥ పల్లవి ॥

యెప్పుడూను వింతలేదు యేసతుల యడాటాన
మెప్పించుకోనేర్తువు మేలుగా నీవు
చిప్పిల నవ్వు నవ్వితేను సిగ్గువడవేమిటాను
చెప్పరాని మహిమలు నేతువుగా నీవు ॥ మిక్కిలి ॥

అంగళ్ళ ముంగిళ్ళ నల్లాడుముద్దు చూపేవు
మెంగతనాలు నీసొమ్ము మేలుగా నీవు
సంగడి నేఁ జెనకితే సమ్మతించేవెందుకైనా
జంగిలి రతులకు వేసరవుగా నీవు ॥ మిక్కిలి ॥

పిలిచితేఁ బలికేవు భేదము లేదేమిటాను
మెలకువగల వింత మేలుగా నీవు
అలరి శ్రీవెంకటేశ అంటితేనే కూడితివి
కలపుకోలన్నిటాను కలవుగా నీవు. ॥ మిక్కిలి ॥ 162

228-వ రేకు

శ్రీరాగం

బంగారువంటిదాన బచ్చివిటుఁడవు నీవు
యెంగిలి నీమాటవింటి నేమి సేతురా
కందువగు నీమేను కాఁగిలించఁగానె నామై
చందముగ నీమేనిలచ్చనలంటెను
చిందరవందరలైన జీబిసంటిపి వలపు
యిందులోనే కానవచ్చె నేమి సేతురా ॥బంగా॥
మొక్కేటి నీపాదాలకు ముందర మొక్కినవారి
యెక్కడిదో కస్తూరిబొట్టు యిదె నన్నంటె
మొక్కలాన ముయికిని ముయివంటిది వలపు
యిక్కడనే కానవచ్చె నేమి సేతురా ॥బంగా॥
బాగాలు నీకిచ్చితేను పాఁగిన నీవుమ్మలము
పోగులై తోచుక నాపుక్కిలి నిండె
బాగుగా శ్రీవెంకటేశ పంటవంటిది వలపు
యీగతినే కానవచ్చెనేమి సేతురా. ॥బంగారు॥

దేసాళం

నీకు బాఁతే చెలులము నీగుణ మిట్టిది గాక
యీకొలఁది నీభావాలేమని నుతింతును ॥పల
చెప్పినట్టే చేసేవు చేరి నేనెంత నీవెంత
అప్పసము నీ వలపేమని నుతింతు
చిప్పిలఁ గొంగు వట్టితే చేతికి లోనై వచ్చేవు
యెప్పుడూ నీ కృపారసమేమని నుతింతును ॥నీకు
ఆడినట్టే ఆడేవు ఆతుమ వన్నుఁ జేసుక
ఆడిన నీ సౌలభ్యమేమని నుతింతు
పీడెము చేతికిచ్చితే వేడుక నందుకొనేవు
యీడ నీ మంచితనము యేమని నుతింతును ॥నీకు

కోరినట్టెల్లాఁ గూడేవు కొంతు గొసరెల్లా మాని
ఆరీతిఁ జుట్టరికమేమని నుతింతు
సారపు శ్రీవేంకటేశ చనవిచ్చి కలసితి
మేరా నీ రతికేలి నేమని నుతింతు ॥ నీకు ॥ 164

## భైరవి

కానవచ్చి నన్నియును గలసుద్దులపుడు
నీ నేరుపులేర్పడీ లోనికి నేఁగరాదా ॥ పల్లవి ॥

చలము నీతో నేల సారె సారెనాపెకు
పలుకు బెంబడినే పచ్చి నేసీని
అలపోకమాటలాపెనాడితివి దానికేమి
నెలపుల రతికి లోనికి నేఁగరాదా ॥ కాన ॥

కోపగించ నీతో నేల కొసరుచునాపెకు
తీపుల బెంబడినే దిమ్ము రేఁచీని
చూపులనే రాజసము చూపితివందుకేమి
నీపనులు దెలిసి లోనికి నేఁగరాదా ॥ కాన ॥

విచ్చిచెప్ప నీతో నేల వేరేవేరే యాపెకు
మెచ్చుల కాఁగిటిలోనే మెప్పించీని
కొచ్చి శ్రీవేంకటేశుఁడ కూడితివి అందుకేమి
నిచ్చఁ బెండ్లాయను లోనికి నేఁగరాదా. ॥ కాన ॥ 165

## భూపాళం

చవులు నేసుక నీవు సారెసారెకు
అవసరములతోడ నారగించవయ్యా ॥ పల్లవి ॥

మాటలమూటల చద్ది మనసులో చిలుపాలు
యేఁటి నేసి విందువెట్టీ నింతి నీకును
పాటలపంచదారలు పచ్చిమోవితేనెలు నీ
యాటలాయ నేఁడిదే ఆరగించవయ్యా ॥ చవులు ॥

చెలియతమకమెల్లా చెమటలై కారుఁగాక
వెలిఁబెట్టవచ్చునా వేఁడుకొనేవు
మలనేటి జాణని మతకములిట్టివే
చలివాపి సతులనాసలురేఁచఁ జూచను ॥ ఎప్ప

అంగనరతులచొక్కు ఆతుమలో నుండుఁగాక
సంగడించితేనంటునా సారె నీకును
యింగితాన శ్రీవేంకటేశ నీకూటమిగర్లై
రంగుగ నీకోఁటిమేలు రచ్చఁబెట్టఁ జూచను. ॥ ఎప్పు ॥ 1

మాళవశ్రీ

మఱియేఁటి సుద్దులు మమ్మేమడిగేవు నీవు
మెఱసి మీయిక్కువలు మించెను దోమ్మలై ॥ పల్ల

యింతిని నీవు చూచితే నింగితాకారమెరిఁగి
చింతతోడఁ దలవంచి సిగ్గువడెను
వింతగానందుకు నీవు వెదనవ్వు నవ్వితివి
పొంతనే కమ్మర నాకె బొమ్మల జంకించెను ॥ మఱి

పడఁతిని దగ్గరితే భావమెల్లాఁ దెలుసుక
చిడుముడి తమకానఁ జెమరించెను
బడినే అందుకుఁ బూవుఁబంతి నీవు వేసితివి
వాడిఁ బెట్టుకొని యాకె వుద్దండాన మొక్కెను ॥ మఱి

అంగనఁ గాఁగిలించితే ఆయములంటే కరఁగె
సంగతిగాఁ బవళించె శయ్యమీఁదను
అంగవించి శ్రీవెంకటాధిప నీవు గూడితివి
వుంగరములాకెవేళ(ళ్ళ?)నొగి మార్పులాడెను. ॥ మఱి ॥ 1

230-వ రేకు సామంతం

ఏమని భావింతు నిన్ను నెంతని సంతోసింతు
శ్రీమంతుఁడ నన్నుఁ దిదే నేఁతోయిది ॥ పల్ల

కాంతుఁడ నేనెంతాడినా గక్కదలవు నీవు
యెంత రాతిగుండెవాఁడ వేమి చెప్పేది
కాంతుఁడవో గట్టువాయిజాణతనమో యిట్టె
మంతుకెక్కించే నామీఁది మన్ననో యిది ॥ ఏమ ॥

దిట్టనై నేజంకించితే తెమలవేమిటా నీవు
యెట్టి చలపాదివాఁడ వేమి చెప్పేది
గుట్టు నీకింతగలదో గుణము చండిపడెనో
గట్టిగా నన్నీదేర్చే కరుణో యిది ॥ ఏమ ॥

దిగ్గె నేఁగాఁగిలించితే బెగడవేమిటా నీవు
యెగ్గులెంతెంచనివాఁడ వేమి చెప్పేది
సిగ్గరితనమో నేఁడు శ్రీవెంకటేశ నీనవ్వో
కగ్గులేకేలితివి నాకన్నవరమో యిది. ॥ ఏమ ॥ 175

శుద్ధవసంతం

చెప్పకున్న దోసము చేఁతలెరిఁగినవారు
కప్పిన సంతోసాలఁ గందువలెరఁగరు ॥ పల్లవి ॥

కన్నెలాల మీరిద్దరు కాఁగిలించేరు చుట్టాలై
పిన్నలు చన్నులొత్తినే పెరిగేపొద్దు
మున్నాడి యొక్కరొక్కరు మొక్కలాదేరప్పటిని
కన్నచో గోళ్లుదాఁకీనే కదువాఁడిపొద్దు ॥ చెప్ప ॥

దిట్టలై ముచ్చటలుగా తీపులు మాటలాడేరు
యిట్టె తేనెగారీ నిప్పలెర్లించే (?) పొద్దు
చెట్టపట్టాలు వట్టేరు చేరి పిరుఁదులురాయ
బటబయలయ్యీ మరుబంట్లు వారేపొద్దు ॥ చెప్ప ॥

బంతినే మీరిద్దరును పాదుగాఁ గూచుండేరు
గుంతలయ్యీఁ బరపెల్లాఁ గూడేటిపొద్దు
యింతలో శ్రీ వేంకటేశుఁడెనసె నిన్నునూ నన్నూ
రంతుగా మాచేనాడించే రాజసమీపొద్దు. ॥ చెప్ప ॥ 176

## దేశాక్షి

మర్మము నీవె యెఱఁగి మన్నింతువుగాక నన్ను
  ధర్మమా నీకువాకుఁ దారుకాణలయ్యా ॥ పల్లవి ॥

పల్లదపు నామాటకు భావింతర్థము నీవు
  చల్లని నామనసుకు సాక్షివి నీవు
  తెల్లముగా నామోముఁ తేటలకళలు నీవు
  చెల్లఁబో యింకా విచ్చిచెప్పనేఁటికయ్యా ॥ మర్మ ॥

చెప్పరాని నాచేఁతకు నెలవినప్పులు నీవు
  వొప్పు నావయసునించే వాడివి నీవు
  ముప్పిరి నాచక్కఁదనమున కద్దమవు నీవు
  చిప్పిల నింకా విచ్చిచెప్పనేఁటికయ్యా ॥ మర్మ ॥

గట్టి నాచన్నులపైఁ జిన్న నహారమవు నీవు
  పట్టిన నావ్రతానకు ఫలము నీవు
  యిట్టె శ్రీ వెంకటేశ యెనసితివింత నన్ను
  చిట్టకాననిఁక విచ్చిచెప్పనేఁటికయ్యా. ॥ మర్మ ॥ 171

## వరాళి

శిరసువంచ మోహానికి నేసుఁ జల్లిన యట్లు
  మురిపేన చెలికత్తె మొగమేమి చూచేవే ॥ పల్లవి ॥

చెంతలఁ బిలువఁగాను చేరి పూఁచుకుంటానన్ను
  పంతము దప్పిన యట్టే పలుకఁగాను
  వంతుతో నీరమణుఁడు వద్ద నిట్టే వుండఁగాను
  మంతనానఁ జెలులచే మాటలాడించేవే ॥ శిర ॥

కొనగోరఁ జెనకఁగాను గుట్టునేసుకొనేవిద
  ననుపున నాఁటినట్టే నవ్వఁగాను
  యెనసి యాతఁడు నీయెదుటనే వుండగాఁను
  చనవిచ్చి చెలులను సాకిరి గోరేవే ॥ శిర ॥

వున్నతిఁ గాఁగిలించితే నొంటినే సిగ్గువడేవు
చన్నులు గుంగినప్పే సరినొత్తఁగా
అన్నిటా శ్రీ వేంకటేశుఁడాదరించి నిన్నుఁగూడె
చెన్నుఁదంటానితనిఁ జెలితో మెచ్చేవే. ॥ ౪౮ ॥ 171

వరాళి

కక్కూరితితనమేల కడదాఁకాను
అక్కరతో నింత నిజమాడి బదుకరాదా ॥ పల్లవి ॥

శిరసుపై తలఁబాలు చెలిచేతిలోనున్నవి
యెరవుగ నాతో నీవు యేలటొంకేవు
నిరతినిందుకుఁ గాను నీతోనేల అలిగేను
అరుదుగ నీవు నిజమాడి బదుకరాదా ॥ కక్కూ

నిన్ను నొత్తిన చన్నులు నెలఁతరొమ్మునవే
యిన్నిటా నీవు నాతోనేల టొంకేవు
సన్నల నిన్నుఁదిట్టుచు సాదించేనా నేనేమి
అన్నిటాను యిట్టే నిజమాడి బదుకరాదా ॥ కక్కూ ॥

నీయధరముపై తేనె నెలఁతపుక్కిలి నించె
యీయెడనెవ్వరున్నారు యేల టొంకేవు
చేయిచ్చి యలమేల్మంగ శ్రీవేంకటేశుఁడ కూడే
వాయింతినే నేను నిజమాడి బదుకరాదా. ॥ కక్కూ ॥ 172

శుద్ధదేశి

ఎప్పుడూను నీవోజలిటువంటివి
తప్పక ఆసతి నీకుఁ దక్కవా యేమైనాను ॥ పల్లవి ॥

పడఁతి లోలో సిగ్గు పచ్చినవ్వే వెఱ్ఱుఁగాక
అడిగితేఁ జెప్పునా ఆదియేఁటిది
కడలేని మగవాని కాతరము జాడిట్టిదే
గడుసుఁదనాననింతిఁ గాకుసేయఁ జూచుమ ॥ ఎప్పు ॥

జంకెనల కారాలు చవుల సాకములు
లంకెల విందులు వెట్టీ లలన నీకు
పొంకపుఁ జూపులంబళ్లు పొదినప్పాల పచ్చళ్ళు
అంకెలాయ నేఁడిప్డే ఆరగించవయ్యా ॥ చవు

కడజపు వినయాలు కాఁగిటిఁ దిబువ్వాలు
సిరులతో విందువెట్టీ శ్రీసతి నీకు
గరిమ శ్రీవెంకటేశ కలసితి రిద్దరును
అరుదాయ నేఁడిప్డే అరగించవయ్యా. ॥ చవులు ॥ 166

కాంబోది

ఎరవుగా నీవు నన్ను ఇందరివలెఁ జూచేవు
దొరతనమే కాక దొమ్మి నేసేనా ॥ పల్ల

వలపు నీపైఁ జల్లి వానికిఁ బెనగేఁ గాక
చెలులతో జగడాలు నేసేదాననా
పలుకుల బువ్వాలవంతికి వచ్చేఁ గాక
అలుకలు మీద మాటలాదేదాననా ॥ ఎరవు

యింగితమెరిఁగి నిన్ను నింటికిఁ బిలిచేఁ గాక
కొంగువట్టి తీసి యింత కొచ్చేదాననా
పొంగుచు నీవద్దనుండి బుద్ధి చెప్పేదానఁ గాక
సంగతి దెలియకింత సాదించేదాననా ॥ ఎరవు

కప్పురము నోరికిచ్చి కారాలు రేఁచితిఁ గాక
చిప్పిల నీమోవి గంటినేసేదాననా
ముప్పిరి శ్రీవెంకటేశ మరువి నన్నుఁ గూడితివి
అప్పసపుదానఁగాక అటువంటిదాననా. ॥ ఎరవు ॥ 16

సాళంగనాట

పేరు కుచ్చి యాతనితో పిలిపించుకోవలెనా
చేరి పీదెమియ్యఁగదే సిగ్గులింకా నేఁటికి ॥ పల్లవి

సరి నీవు నవ్వితేనే సరసానఁ బైకొంట
యిరవుగాఁ జూచితేనే యియ్యకొనుట
గరిమ మాటాడితేనే కంకణము గట్టుకొంట
సిరుగ రావే యేల జాగు సేసేవు ॥ పేరు ॥

చేరి తిట్టినప్పుడే చేఁతలు చేసేనాట
పారెఁ బయ్యెద మూయుటే చవి సేఁచుట
కోరఁగా నానవెట్టుట గోరికొనకు చేసేనాట
కూరిమి చేకొని రావే గుట్టింతచూపక ॥ పేరు ॥

యెదురెదురనుండేనే యిచ్చల సేసవెట్టుట
యిదె చెక్కు చేయంటితే నింపు చల్లుట
అదన శ్రీ వేంకటేశుఁడాతఁడు తా నిన్నుఁగూడె
చెదరకిల్లు రావే చెప్పించుకొనక. ॥ పేరు ॥ 168

129-వ రేకు దేవగాంధారి

ఆయమంటి మోవితీపులానఁగరాదా
వోయమ్మ వద్దనున్నాఁడు వూరకుండ నేఁటికే ॥ పల్లవి ॥

చెక్కు నొక్కఁ బొద్దులేదా నేదదేరఁ బొద్దులేదా
గుక్కక పతిఁ గాఁగిటఁ గూడఁగ రాదా
వెక్కసపు విరహాన విసిగితివిందాఁక
యిక్కడికే పతి వచ్చె నిఁకనేలే కొసరు ॥ ఆయ ॥

నవ్వు నవ్వ వేళలేదా నమ్మికకు వేళలేదో
పువ్వువలెఁ గాఁగిటను పొదుగరాదా
దవ్వుల నున్నాఁడంటా తమకించితివిందాఁక
యివ్వల నీ గుబ్బలంటె నిఁక జాగువలెనా ॥ ఆయ ॥

మాటాడఁ దతిలేదా మనసియ్యఁ దతిలేదో
గాఁటముగ దెరవేసి కలయరాదా
యేఁట వెట్టి శ్రీ వెంకటేశుఁడిదె నిన్నుఁగూడె
యీటుగానే మన్నించె నిఁక నెదురేదే. ॥ ఆయ ॥ 169

## కాంబోది

ఎట్టునేసినాఁ జేయుమిక నాతఁడల్లవాఁడే
పట్టరాని వ్రతముతో పానుపుపైనే ॥ పల్లి ॥

కప్పురపుమోవి నీవు కాంతునికిఁ జూపఁగాను
దప్పిదేరీ నాతఁడదే చిప్పులనుండే
చెప్పరానిచేఁతలు చేరి నీవు నేయఁగాను
చిప్పిలీ నీరతులను చిత్తములోనే ॥ ఎట్టు

కన్నులఁ బయ్యద నీవు జారఁదోయఁగా నతఁడు
కన్నుల పండుగనేసీఁ గదనుండే
వెన్నెలనవ్వులు నీవు వెదచల్లఁగాఁ జూచి
మిన్నక మోమునెల్లా మించీని కళలు ॥ ఎట్టు

చివ్వన దగ్గరి నీవు శ్రీ వేంకటేశుఁ గూడఁగా
జవ్వనాన ఫలమంది సరుసనుండె
రవ్వగా సరసము నీరపముగా నాడఁగాను
బువ్వపువిందులు చేత భోగించీ నిపుడు. ॥ ఎట్టు ॥ ౹

## పాడి

మూద నిట్టున్నాఁడపు సోదించి చూచితేను
మాదకు వేసరిఁ దెచ్చే మతకమెరఁగను ॥ పల్లవి

తగిలి యెవ్వతెమైనాఁ దప్పక నిన్నుఁ జూచితే
జిగురంటినట్టేకాక చేరి పాసీనా
మగువ భ్రమయించును మగవాని నందురు
మగువల మించితివి మహిమ నెరఁగను ॥ చూద

నీఁటుకత్తె యెవ్వతైనా నీతోను మాటాడితే
వేఁటమేకమౌఁగాక వేరె పాసీనా
మాఁటల పందిలివెట్టు మానిని యందురుగాని
మాఁటల గుఱ్ఱుగట్టి మము నింతసేసేవు ॥ చూద

గొలసితే నీ ముందరఁ దొరాక యెవ్వరైనా
వలలకు లోనేకాక వడిఁ దాసీనా
యిల లక్ష్మీ శ్రీ వెంకటేశ నీ వురమెక్కెను
మలసి నా వురమెక్కి మన్నించు పెరఁగను. ॥ చూడ ॥ 178

సాళంగ

మొగమోటమున నీకు మొక్కేనేను
తగవులఁబెట్టుకొని దగ్గర నున్నాఁడవు ॥ పల్లవి ॥

పెరుపుగల మగువ నిన్నుఁ బిలిపించితేను
వొరుపుగలిగినాపె వొద్దఁ గూచుండె
మెర యెరి నవ్వరాదు మెలుఁతను దూరరాదు
నీరువంకతుంగవలె నీవున్నాఁడవు ॥ మొగ ॥

చన్నులు గొప్పలైనాపె గక్కన సన్న నేసితే
చన్నులు పిన్నలైనాపె చల్లె వలపు
నిన్నుఁ జైకొనఁగరాదు నెలఁతఁ బొమ్మనరాదు
అన్నిటా రొంపికంబమవై నీవున్నాఁడవు ॥ మొగ

అయాలు సోఁకించినాపె అట్టె నిన్నుఁ గూడితేను
మాయలు నేరిచినాపె మరిఁ గూడెను
యీయెడ శ్రీ వెంకటేశ యిద్దరి మిమ్మనరాదు
పాయక నా వురముపై పంతానున్నాఁడవు. ॥ మొగ ॥ 179

మెంచబౌళి

ఎవ్వరు బుద్ధిచెప్పేరు యిద్దరికి మీకు వేఁక
అవ్వల నివ్వల నీవే ఆదరించు మీపెను ॥ పల్లవి ॥

మచ్చరపు సతులతో మారుమలతువుగాక
యిచ్చకపు సతితోడ నింతగలదా
తచ్చి నీకు కుంచవేసి తలవంచుకున్నదాపె
మచ్చి నీవైతే మోనాన గుట్టుననున్నాఁడవు ॥ ఎవ్వ ॥

పంతపు వనితలనెపైపై సాదింతువుగా
చింతించే నీవద్దిచెలిఁ జిమ్మిరేఁతురా
మంతనాన విడెమిచ్చి మానాన మొక్కెగినాపె
రంతుల నీవైతేను రాజసముచూపేవు ॥ ఎవ్వ॥
వేసాల మగువలతో విఱ్ఱవీఁగుదువుగా
ఆసపడ్డకాంత నింత అలయింతురా
పాసిన కాఁకలుదీర పాదములొత్తీనాపె
శ్రీసతీశ కూడితివి శ్రీవెంకటేశుఁడవు. ॥ ఎవ్వ ॥

231-వ రేకు

కన్నడగౌళ

ఎవ్వరి నేమడిగేవు యేమని చెప్పేము నేము
జవ్వనపు నీ పంతము సంగడినేవున్నది ॥ పల్లవి॥
పదఁతి మాటలలోని భావము తెలుసుకొంటే
అదరిన నీ మోహమందేవున్నది
తడఁబడే మతిలోని తలఁపు తెలుసుకొంటే
విడువని నీ నేర్పు వెనకనేవున్నది ॥ ఎవ॥
అంగన నవ్వునవ్విన ఆయము తెలుసుకొంటే
అంగవించే నీ భోగ మందేవున్నది
సంగడినాడే సరసములే తెలుసుకొంటే
చెంగటి జాణతనాలు నీ చేతిలోనేవున్నవి ॥ ఎవ॥
యింతి కాఁగిలించుకొన్న యితవు తెలుసుకొంటే
అంతటివేడుక నీ యాత్మనున్నది
వంతుల శ్రీవెంకటేశ వనితఁ గూడితివిట్టే
మంతనాలన్నియు నీ మర్మములోనున్నవి. ॥ ఎవ్వ ॥ 181

రామక్రియ

ఇంక నేమిసేయఁగల మింతకంటే రావయ్య
అంకెల మా యింటిలోని కానపడ్డవారము

అంగన లేమిటివారు ఆయము నీ చేనున్నది
సంగతెరిఁగి నడపే సరవి నీది
వుంగిటిగాఁ గోపగింతు మొకమారు నవ్వుదుము
యెంగిలిమోవి బత్తేల నేలుకొన్నవారము ॥ ఇంక ॥

పడఁతు లెంతటివారు భావము నీ నేర్పినది
విడువక భోగించే వేడుక నీది
చిడుముడి జంకింతుము చెక్కు లట్టెనొక్కుదుము
తొడసోఁకిన జీతాలదొమ్మిపాఁజువారము ॥ ఇంక ॥

వనిత లెందటివారు వలపు నీ వసమిది
ననుపుగాఁగూడిన యీ నటన నీది
కొనగోరంటింతుము మొక్కుదుము శ్రీవెంకటేశ
వొనరిన నీ రతుల వూడిగపువారము. ॥ ఇంక ॥ 182

ఆహిరి

మానినినింతే నేను మన్నించవలెనా
యేనాట నావల్ల గుణమీపాటి చాలదా ॥ పల్లవి ॥

తనువు నీకప్పగించి తమకాన భోగించఁగా
మనసేమి సోదించేవు మరియూనన్ను
ఘనులకు నిమ్మపండు కానుకగాఁ బెట్టితేనే
తనివొంది పదవులు తామే యొసఁగుదురు ॥ మాని ॥

చూపులు నీపైనిలిపి సుద్దులు నేఁ జెప్పఁగాను
తీపు లేమి వెదకేవు దిష్టించి నన్ను
మేపుమీరిన దొరలు యేపాటినుతించినాను
పైపై నందుకులోనై పమ్మి కరఁగుదురు ॥ మాని ॥

అన్నిరతులకులోనై అట్టే చొక్కించఁగాను
చన్నులేల గోరూఁదేవు సారెకు నన్ను
యిన్నిటా శ్రీవెంకటేశ యీ కతలు నీచెలుల
కెన్నికతో నానతిమ్మా యిట్టే నిన్నుమెత్తురు. ॥ మాని ॥ 183

## మధ్యమావతి

ఇట్టై (నేఁ) నీసవెట్టి నీవు యేమ తేవా నీపనులు
బట్టగు త్తరై నవారు ఫలమందకుందురా ॥ పల్లవి

యేలుకొన్నవాఁడవు నన్నేల దిగవిడిచేవు
చేలకొంగువట్టి యింత నేతువుగాక
బాలకిసై యెంత సిగ్గువడినాను నీకేమి
కూలిచ్చినవారు పనిగొనక విడుతురా ॥ ఇట్టై

మాటలాడినవాఁడవు మన్నించ కేలపొయ్యేవు
వాటముగా నీయిచ్చకు నేత్తువుగాక
సీటుతోడ వేడుకకు నిద్రించితే నీకేమి
గూఁటనున్నపక్షి చేతవేఁటాడ లోఁగేరా ॥ ఇట్టై

కూడినవాఁడవు నామై గోరూఁదకేల చిక్కేవు
మేడెపురతిఁ జొక్కించి మంతువుగాక
నీడనె శ్రీ వెంకటేశ నే నలసితే నీకేమి
వాడుఁజేన వానగురిసి వరదచాలించునా. ॥ ఇట్టై ॥ 18

## కన్నడగౌళ

హత్తి రాజసపువాఁడ వయినాఁగాని
చిత్తమువచ్చినయట్టు నేతువుగాని ॥ పల్లవి ॥

చనవు గలిగేనంటా సారె సారె మాటలాడె
విని విని నీవేమి వేసరకుమీ
మనసునఁ గలదెల్లా మరిదాఁచనే నీకు
మునుకొన్న సతులకు ముచ్చట స్వభావము ॥ హత్తి ॥

నిండిన మందెమేళాన నీతో సరసమాడేను
అండనే అందుకు లోనై అలయకుమీ
వుండిన దున్నట్టేకాని వూరకే కల్పించనోప
నిండు గరితెలాడితే నిజమునిషూరము ॥ హత్తి

కాతరాన నిన్ను నిట్టే కాఁగిలించుక కూడితి
నాతమకములుచూచి నవ్వేవు సుమ్మీ
ఘాతల శ్రీ వెంకటేశ కైకొంటివి నిన్ను దూర
రాతిరిఁబగలునుండి రతులఁ జొక్కితిని. ॥ హత్తి ॥ 185

దేసాళం

అవునే యింతేసి నేసేవపుడే నీవు
చవులుసేసి యిచ్చేది జవ్వనమేకాదా ॥ పల్లవి ॥
సిగ్గువడ్డవారికిని చెక్కిటి చేయేమరఁగు
దగ్గరి రాఁగదవే ఆతఁడు పిల్చిని
కగ్గులేక నీవంటి కన్నెలేకారా పతిని
యెగ్గులుఁ దప్పులుసోఁక నెలయించేవారు ॥ అవు ॥
నెలవి నవ్వేవారికి చేతిమొక్కులే మరఁగు
తలఁగకుండఁగదే ఆతఁడు ముట్టిని
మొలచిన నీవంటి ముగ్ధలేకారా పతిని
తెలిపి రతికిఁదీసి తెమలిఁచేవారు ॥ అవు ॥
కాఁగిటఁగూడేవారికి కనురెప్పలే మరఁగు
[illegible]ఁగకువే కూడెను శ్రీ వెంకటేశుఁడు
మాఁగినమోవి నీవంటి మానాపతులేకారా
రాఁగలై యీతనిఁ బొంది రవ్వకెక్కినారు. ॥ అవు ॥ 186

232-వ రేకు సాళంగనాట

ఇన్నాళ్ళు నెరఁగమైతి మిదివో తాను
పన్నుక వూరక వాదఁబరచీఁ దాను ॥ పల్లవి ॥
తలఁపే తెలిసితేను తాఁ దానే కదవే
నలువంక నూరకే నవ్వీఁ దాను
వెలియల్లాఁ జూచితేను వెల్లవిరి గదవే
పిలిచి నాతో నానపెటుకొనీఁ దాను ॥ ఇన్నా ॥

అడుగఁబోతే సుద్దులు అంతా మేలేకదవే
కొడిమె లెంచేనంటేఁ గొంకీఁ దాను
చిదుముది మొక్కితేను సిగ్గురేఁగీఁ గదవే
బడిబడి మీఁదటికి బాసచేసీఁ దాను ॥ ఇన్నా ॥

వన్నుల నేఁ జూచితేనే గట్టియాయఁ గదవే
యిన్నిటా శ్రీవెంకటేశుఁ డెనసెఁ దాను
విన్న వినికెల్లా నేఁడు వేడుకలే కదవే
మన్ననలు నాకిచ్చి మచ్చికాయఁ దాను. ॥ ఇన్నా ॥ 191

ముఖారి

ఇందుకుఁగాఁ బ్రతివాదారేలే విభునితోడ
పందెమువలె గెలుపు పైపైనేవుండును ॥ పల్లవి ॥

మచ్చికసేసీ నతఁడు మారుమాటాడకువే
కుచ్చిపట్టి కాఁగిలించికూడె నిన్నును
వచ్చిరాని పందెమువంటిచే యీవలపెల్లా
కొచ్చి లోలోఁ దలఁపించుకొంటాఁ దానుండును ॥ ఇందు ॥

వెక్కులునొక్కి నతఁడు వెమరించి తిట్టకువే
పక్కన నిట్టెకాఁగిటఁబట్టీ నిన్నును
చక్కెరబొమ్మవంటిది చవిగొంచే నీవలపు
యెక్కడఁ జిక్కించుకొన్నా నింతాఁ దీపైవుండును ॥ ఇందు ॥

మేలెను శ్రీవెంకటేశుఁ డెగ్గులేమీ నెంచకువే
లాలించె రతులఁ బెక్కులాగుల నిన్ను
పాలజలధివంటిది పచరించిన వలపు
వేళ నెంతవాడినాను వెలితిగాకుండును. ॥ ఇందు ॥ 188

రామక్రియ

ఏమనునో దగ్గరఁబో యీవేళ నేఁ జెనకితే
కామించి కామాంధకారానున్నాఁడు ॥ పల్లవి ॥

నవ్వు నవ్వునోప నాసరికాఁడు రమణుఁడు
అవ్వల నేమనునో యనీకాక
దివ్వెత్తేఁ బొద్దుదాఁకా తిరిగివచ్చి యింటిలో
వువ్విళ్ళూరుచు ననురును రై వున్నాఁడు ॥ ఏమ ॥

ఎంతమాదనేర నాపల్లటీఁడు నాయకుఁడు
అంతరంగము దెలిసె ననీకాక
బంతుల చుట్టాలకెల్లా పనులెల్లా జేసివచ్చి
అంతటఁ బానుపుమీఁద నలసివున్నాఁడు ॥ ఏమ ॥

కమ్మి చూడనోప నాగబ్బి శ్రీవెంకటేశుఁడు
అమ్మలాల నన్నుఁ గూడే ననీకాక
సమ్మతించి సతులతో సముల పేసివచ్చి
కుమ్మరింపు సిగ్గులతో నన్నునున్నాఁడు. ॥ ఏమ ॥ 189

సౌరాష్ట్రం

నామర్మమిట్టిది యిఁక నీమర్మమానతీరా
యీమేరఁజూచినవారి కెంతబంటో యిఁకను ॥ పల్లవి ॥

మక్కువ నీతో నేను మాటలాడినంతలోనే
పుక్కిటిబంటె (టా?)యరా పూఁచి వలపు
చెక్కుల చెమటలెల్లా చెరువుల వానలాయ
యిక్కడ నన్నుఁ జూచి నీకెంతబంటో యిఁకను ॥ నామ ॥

కన్నుల నీరూపుచూచి కరఁగి గుండెలుమోఁచి
చన్నులబంటె(టా?)యరా సరివలపు
వున్నతిఁ మోవితేనియ లువ్విళ్లూరఁగఁ జొచ్చె
యిన్నిటా నా జోడైతి వెంతబంటో యిఁకను ॥ నామ ॥

కలసి నీవద్ద నేను గద్దెపీఁటపైఁ గూచుండి
మొలబంటియాయరా యిమ్ముల వలపు
కులికి శ్రీవెంకటేశ కూడితివి వయోమద
మెలమి మదుగులుబ్బె నెంతబంటో యిఁకను. ॥ నామ ॥ 190

## కాంభోదమలహరి

ఇన్నాళ్లనెఱఁగనైతి మింతేసినుద్దులు
విన్నవి రాఁగారాఁగా వెల్లవిరులాయను ॥ పల్ల॥

మంతనాన నీతోను మాటలు నేనాడినవి
యింతులెల్లా నాడుకొనే రిదేమయ్యా
చెంతల నీవింతేసి సిగ్గులు విడిచితేను
కాంతలు నీతో పొందుమగావించుటే నేరమి ॥ ఇన్నా॥

రతివేళ నామేనరచించిన నీచేఁతలు
సతులెల్లా సోదించేరు సారెసారెకు
యితవై నీవాడికకు యింతేసి వెరవకున్న
హితులాడిగాలువేయనేఁటికి నీయెదకు ॥ ఇన్నా॥

నసుపున నీవు నేను నవ్వినన వ్వులకును
వనితలెల్లా మెచ్చేరు వద్దనున్నట్టే
యెనసితివి శ్రీవెంకటేశ నన్నింతేసిగాను
చనవరులకును మచ్చాతియాయ నిపుడు. ॥ ఇన్నా॥

## ముఖారి

చిగురువంటివాఁడవు చెలులంగటే విడువవు
అగపడి యింటివారు అన్నంతాఁ గలిగెను ॥ పల్ల॥

చిక్కని నీమాటలకే చెమరించె మ(మే?)నెల్లా
తక్కని చేఁతలు వింటే తలఁపెట్టౌనో
అక్కజపు నీవినయ మాయనాయఁ దనిసితి
మొక్కేనన్నా విడువవు మొలవట్టేవిపుడు ॥ చిగు॥

వెద నీ నవ్వులకే వెరగందె నిలువెల్లా
అదరి నీవద్దనుండే నాస యెంతౌనో
మిదిమాలపు నీమెచ్చు మేలుమేలు కైకొంటి
వదినోపవన్నాఁ బోవు వచ్చి కాఁగిలించేవు ॥ చిగు॥

కన్నుల నీచూపులకే గరివడఁ బులకించె
వన్నెల నిన్నొ్త్తేను చవి యేరితో
పన్నిన శ్రీవెంకటేశ దాపు దాపు కూడితివి
సన్నసేసినాఁ గొంకవు సారె మన్నించేవు. ॥జగు॥ 192

33-వ రేకు శంకరాభరణం

నేరుపరి విన్నిటాను నీకు నే లోను
కారముగాదు కప్రము కానీవయ్యా ॥పల్లవి॥

పలుకనేరిచితేను బయలెల్లాఁ బందిలి
చలము సాదించితే శశియేరవి
యెలమి నీమాటలకు నెదురాడగలనా
[illegible]సి కాఁగిలించేవు కానీవయ్యాయిఁక [illegible] ॥నేరు

వేస[illegible] నిలిచితే వేఁడైనఁ జలు[illegible]
రాసి దంచదొరకొంటే రాయేపింకి
ఆసపడి నీ వున్నం[illegible] [illegible]ద్ద [illegible]ఁగలనా
కై నేసుక నన్నించేవు కానీవయ్యా ॥నేరు॥

గారవించి కూడితేను కాఁగిలే చెమటనీరు
గోర గీరఁబోతేను గుంతేయే [illegible]
సారపు శ్రీవెంకటేశ [illegible]న్నసేయఁగలనా
కారణానఁ గూడితివి కానీవయ్యా. ॥నేరు॥ 193

నాట

ఏఁటికి దగ్గరేవయ్యా యిదేమి నీవు
మోఁటునసుందానఁ జన్నుమొనలు దాఁకిని ॥పల్లవి॥

పచ్చని చీరగట్టిన బలుదొరనంటానే
కుచ్చుల పిలిచుంగుల కొంగువట్టేవు
దిచ్చరి చెంచువారికి దేవరకు నేమిపని
ముచ్చట లాడఁగఁ జన్నుమొనలు నాఁటీని ॥ఏఁటి॥

అంగమెల్లఁ జెమరించె నట్టె గందము గరఁగె
సింగారించుకొన్న కొప్పు చీఁదరరేఁగె
యెంగిలి వాయఁగ నీకు నిదే జలకమువట్టె
సంగతిగా లేవయ్య జాగులెందాఁకాను ॥ అల ॥

పులకలు గడుసించె బుసకొట్టి చెలఁగె
తెలుపెక్కి కనుచూపు తేటవారెను
బలుపసత్తువరాను పాలునేయిఁదెచ్చితిని
సలుపక లేవయ్య జాగులెందాఁకాను ॥ అల ॥

మోమునఁ గళయుముంచె మోవిపై పేఁతలురాఁగె
నాముతో శ్రీవెంకటేశ నన్నుఁ గూడితి
చేముట్టిచ్చే మాటుమంచు చెనకుల నాలోపొందు
జామాయను లేవయ్య జాగులెందాఁకాను. ॥ అల ॥ 196

సామంతం

ఆసతి మరఁగువాఁడ వన్నిటా నీవు
మోసపోక నీవాపె ముద్దులడేరాదా ॥ పల్లవి ॥

వేపట్టేవు నీకు నేఁ జెప్పినట్టు నేనేఁగాని
ఆపె నడిగి రారాదా ఆమాటే
దూపిలేవు నీచేఁతకుఁ దొరలకుందాననంటా
చాపలాన నీవాపెను సమ్మతింపించరాదా ॥ ఆస ॥

పైకొనేవు నీకు నేఁ బనులునేనేఁగాని
ఆకాంతఁ దోడితేరాదా అప్పణగాను
కాతరివై దూరేవు గక్కన విదెమీనంటా
పోకులఁబోక నీవాపెఁ బూఁటవెట్టరాదా ॥ ఆస ॥

పూవులవేసేవు నీకు పొందై వుండేఁగాని
ఆవనితఁ గూడరాదా అప్పుడే ముందే
శ్రీవెంకటేశ నన్నుఁ జెందితివి ఆలనంటా
కావించే(చా?)పెకుఁ జెల్లెలిఁగా నన్నుఁ జేయరాదా. ॥ ఆస ॥ 197

గౌళ

ఎవ్వరికిఁ గలదయ్య యిటువంటి నేరుపు
దవ్వులనుండఁగా నీవు తావులిచ్చేవు ॥ పల్లవి ॥

వెలఁదు లెవ్వరిఁగన్నా వింతలేదుగాన నీకు
సులభాననే దొరకుఁ జుట్టరికము
మలసి చల్లలమ్మేక మందనుండిరాఁగానే
కలపుకోలుఁదనానఁ గాఁగిలించేవు ॥ ఎవ్వ ॥

అంగనలఁ గంటే వావులట్టే నీకు దొరకుఁగా
వెంగటనే చెట్టవుఁ జేటఁదేసి
ముంగిటనే పాలుగాఁచి మూలఁ దోసంటువెట్టఁగా
సంగతిగా నప్పుడే మంచమువంచేవు ॥ ఎవ్వ ॥

పొరుగు సతులుండితే పొరచి వేడకలాఁగా
దొరకొలుదానికిఁ బొందులు దాఁతే
యిరవై శ్రీవెంకటేశ యిటు నన్నుఁ గూడితివి
తెరవేసి వంషల తీపుచల్లేవు. ॥ ఎవ్వ ॥ 1

234-వ రేకు కేదారగౌళ

ఎందువోయితి విందాఁకా యెక్కడనుంటె నీనేర్పు
ఒందెకు నప్పుడాతని పట్టుకుండవలదా ॥ పల్లవి ॥

నేనాతనితో నవ్వితే నీకేలే చింత
నాననిచ్చి నీవూఁ గొంత నవ్వరాదా
సానఁబెట్టె(ట్టి?)తఁడు చూపు జళిపించేయపుడు
మానుపరాదా నీమగని నన్నలను ॥ ఎంద ॥

చెక్కాతని నేనొక్కితే చిమిదేవదేమే
చిక్కనిచ్చి నీవూఁ జేఁత సేయరాదా
మక్కువ నాతఁడు నామర్మమంటేయపుడు
నిక్కి కోపగించరాదా నీపతినెమ్మెలను ॥ ఎంద ॥

కలసినే నీవితని గద్దించే వెవ్వతవే
వలసినప్పుడు నీవూ వంచుకోరాదా
చెలమి శ్రీవెంకటేశుఁ దెలయించేయపుడు
వలపించి నీవిభుని వంకలొత్తరాదా. ॥ ఎందు ॥ 199

సాళంగం

నీయితవు దెలియక నే వేగిరపడరాదు
యీమెడ నీయాలనై యింటనే వుందానను ॥ పల్లవి ॥

సాతె సేనవ్విన నవ్వు చలువో వేఁడో
ఆరీతి నీమతిఁ గలప్పాసెదవయ్యా
సిరుకొద్ది తామరనై నీతోఁ బొందునేసేను
పేరబెట్టితేవలపు పిండఁతేనిప్పటి ॥ నీయి ॥

పలికేటి నామాట పలచనో చిక్కనో
అలరి నీకుఁ దోచినట్టానతీవయ్యా
బలిమికొద్ది పంతానఁ బట్టి నిన్నుఁ బెనఁగేను
వలచినవలపులు వచ్చినంతేలాభము ॥ నీయి ॥

కూడినట్టి నాకూటమి కొసరో పిసరో
ఆడినంతా నియ్యకొనే నానతీవయ్యా
వేడుక శ్రీవెంకటేశ వెన్నకొద్దినెయ్యా
తోడరాఁగా వలపులు తూఁకినంతేవాకిలి. ॥ నీయి ॥ 200

సామంతం

వలెఁనా యివిగొన్ని వట్టివేసాలు
అలసితివన్నిటాను అయనాయలేవే ॥ పల్లవి ॥

చిక్కని చెమటలకే సిగ్గులు వడేవు నీవు
యెక్కువనిట్టూర్పులకు నేమి సేనేవే
నెక్కొన్న రతిచిహ్నలు నీతలనే వేగెనటే
ముక్కునబంటి భోగించే ముగుదువా నీవు ॥ వలె ॥

అలకల చెదరకు నట్టే సిరసు వంచేవు
మెలమిఁ గన్నులతేట లెందుఁబెట్టేవే
నెలకొన్న యీవన్నెలు నీవల్లనే వచ్చెనదే
కలగంపగాఁ గలసే కన్నెవా నీవు ॥ వలె ॥

బొట్టు చెదరినందుకు పొంచి తెరలువేసేవు
యిట్టె నీమోము కళలెట్టు దాఁచేవే
నెట్టన శ్రీవెంకటేశు నీవేకూడితివదే
పటము గట్టక పొందే దాలవా నీవు. ॥ వలె ॥ 201

## ఆహిరి

తప్పులెంచవని నిన్ను దగ్గరితి నిటుగాక
వొప్పగించే వీరాల కోపుదునా నేను ॥ పల్లవి ॥

చిక్కని నీనవ్వులకు చేసేటి చేఁతలకు
యెక్కువగా సింతేసి మోహించితిఁగాక
తక్కుల నీగుబ్బలకు తచ్చన సన్నలకు
వొక్కమాఁటే యీపనులకోపుదునా నేను ॥ తప్పు ॥

కన్నుల నీమొక్కులకు కరుణారసానకు
కన్నెనయ్యే నీకు తాళి గట్టితిఁగాక
మిన్నక నీమేకులకు మేరలు మీరుటకు
వున్నతి నీవాఁపులకు నోపుదునా నేను ॥ తప్పు ॥

కలిసితివి రతికిఁ గడలేని మన్ననకు
పిలిచి నీకే నేస వెట్టితిఁగాక
యెలమి శ్రీవెంకటేశ యిట్టి నీవినయాలకు
వొళవుగా సిగ్గువడ నోపుదునా నేను. ॥ తప్పు ॥ 202

## మాళవిగౌళ

ఇంక నెంతగాఁగలదో యింతివల్ల నీకు
సంకుఁజక్రాలచేతుల సరుసకువచ్చెను ॥ పల్లవి ॥

నల్లగలువలవంటి నాతిచూపు నీమైనంటి
నల్లనాయ నిలువెల్లా నాథుఁడ నీకు
వెల్లవైన వలపులు వేడుకల నీపైసోఁకె
వెల్లిమేరు పాదముతోఁవిభుడవు నైతివి ॥ ఇంక ॥
బంగారువంటి రూపుపడఁతి పొందుసేయఁగ
బంగరుదట్టిగురుతుపతివైతివి
సంగతిగాఁ దామరలసరవిపాలుమోఁచి
అంగజుగురుఁడ జలజాక్షుఁడవైతివి ॥ ఇంక ॥
వేవేలుమాటలనేర్పువెలఁది కాఁగిటఁగూడి
వేవేలు పేళ్ళు గలిగె వెన్నుఁడ నీకు
భావించఁ గొండలవంటి బలు కుచములునాఁటి
శ్రీ వెంకటేశుఁడవై సిరుల ఓంచితివి. ॥ ఇంక ॥ 203

భైరవి

సంగతి గానిపనికి సాకిరున్నారా
అంగవించి విడెమీఁగా నదేమంటిఁగాక ॥ పల్లవి ॥
సమ్మతించినమాటకు జగడములున్నావా
దొమ్మిసేసి యంటఁగానె దూరేఁగాక
యిమ్ముల నేరమంటే యిప్పుడే లేదనేనా
అమ్మరో యిల్లుచొరఁగా నదేమంటిఁగాక ॥ సంగ ॥
చుట్టరికము గలితే సూడువట్ట వచ్చేనా
వెట్టికిఁ బైకొనఁగాను వేసరేఁగాక
గట్టిగానె నవ్వితేను కాదని తొలఁగేనా
అట్టె సందుకొనగాను అదేమంటిఁగాక ॥ సంగ ॥
తొలుతనె చెప్పితేను తొలమని తోసేనా
బలిమిఁ బెనఁగఁగాను పదరేఁగాక
యెలిమి శ్రీ వెంకటేశుఁ డిన్నిటా నన్నుఁగూడెను
అలయించఁగా రతుల నదేమంటిఁగాక. ॥ సంగ ॥ 204

235-వ రేకు బౌళిరామక్రియ

కూరిమె సిగ్గులు తెగి కొంకనేఁటికి
యేరీతినైనా నీవు యియ్యకొనవయ్యా ॥ పల్లవి ॥

పట్టినదే వ్రతము పడఁతులకుఁ జలము
అట్టె పతులకుఁ జేయకపోరాదు
అట్టిదీ యాపె మోవిచూపులకు నాసపడేవు
యెట్టైనఁ జేయని నీవియ్యకొనవయ్యా ॥ కూరి ॥

ఆడినదేమాటా అంగనలు పంతమున
నాడోడికయినా వినకపోరాదు
తోడనే మేలుది యాపె తొలఁగనీవు నీవు
యేడసుద్దికైనా నీవియ్యకొనవయ్యా ॥ కూరి ॥

తలఁచినదే పొద్దు తరుణులకుఁ గాఁగిటికి
వలపులు ముదిరెను వద్దనరాదు
బలువాపెది శ్రీవెంకటపతివి నిన్నుఁగూడె
యెలమి నన్నిటికి నీవియ్యకొనవయ్యా. ॥ కూరి ॥ 205

పాడి

ఒట్టువెట్టుకొందే నేమి వొద్దు దోసములేదనె
వట్టిచింతఁ బొరలక వద్దికి రారాదా ॥ పల్లవి ॥

మలసేయప్పటివేళ మాటమాటజగడాల
అలిగి లేచిపోయితే నందుకేమి
వెలినుండి నీవేల విరహానఁ బొరలేవు
చలమొద్దు నావద్దికి సరుగ రారాదా ॥ ఒట్టు ॥

నినుఁ జూచి నవ్వితేను నిజము నెరపెనంటా
గునిసి యల్లంతనే కూచుంటివి
మనసు పట్టఁగలేక మరియేల పొరలేవు
చనవుసేసుక నామంచానకు రారాదా ॥ ఒట్టు ॥

వేడుక యారతి నీవె వేళమె ముందుగరఁగి
తోడనె సిగ్గులఁబొంది దూరుకొనేవు
యీడకేతెంచి శ్రీవెంకటేశ నన్నుఁగూడితివి
మాదిమాట పంతములా మరి సు రారాదా. ॥ ఒట్టు ॥ 206

భైరవి

మూసినముత్యాలవంటి ముద్దరాండ్లము
యీసరిబేసికి నీతో నెదురాడఁగలమా ॥ పల్లవి ॥

చలిమేలనేయను పలుకకుండినవారి
అలిగేటివారులేరా అండువారు
చలపట్టి మాటలాడ జాణలులేరా వూరిలో
యెలమి నీతో నేము యెదురాడఁగలమా ॥ మూసి ॥

సిరనేలయెత్తను సిగ్గువడివున్నవారి
జరసేటివారులేరా సారెనింతులు
దొరవై పనులుగొన తొత్తులు బంట్లులేరా
యిరవై నీతో నేము యెదురాడఁగలమా ॥ మూసి ॥

కొంగులేలపట్టను గుట్టననుండినవారి
కంగివున్నవారులేరా కామినులు
రంగుగ శ్రీవెంకటేశ రతి నన్నుఁగూడితివి
యింగితాన నీతో నేము యెదురాడఁగలమా. ॥ మూసి ॥ 207

కాంభోది

పుట్టుభోగిజవరాలు పొలఁతి యిది
పట్టెమంచముమీఁదటఁ బవళించేదెపుడు ॥ పల్లవి ॥

కందువ నీకిందాఁకా గతులు చెప్పనేపట్టె
యెందాఁకా వేగించు నింతి నీతోను
అందముగ నిలుచుండి ఆకుమడిచియ్యఁబట్టె
కుందణపు గద్దెమీఁదఁ గూచుండేదెపుడు ॥ పుట్టు ॥

ములికనేరదుగాని భావములోనిచేఁత
బెళకకుండా నట్టె పెట్టుకున్నది
అలుగకున్నదిగాని అనువువచ్చినదాఁకా
చలములు యేకతాన సాదించుకున్నది ॥ అప్ప ॥

జంకించకున్నదిగాని జగడాలు కొనగోళ్ల
ముంకనెప్పుడోయని మీఁదెత్తుకున్నది
కొంకి తిట్టదేకాని గురిమైన రతిదాఁకా
పొంకపు బూతుమాటలఁ బూఁచుకున్నది ॥ అప్ప

గట్టువిడువదుగాని కొనవుల మొక్కులెల్లా
దట్టమై నీపాదాలకు దాఁచుకున్నది
ముట్టై శ్రీవెంకటేశ యెనసితివిందాఁకా
అట్టెవున్నది సితలపుఁ లఘుగఁగనున్నది. ॥ అప్ప ॥ 21॥

-వ [illegible] పాడి

ఇందుకుఁగా నెవ్వరూ మరేమినేసేరు
మందెమేళమోపకున్న మరియూ మొక్కేను ॥ పల్లవి

పనవు గలుగఁగానె చవిగాక వలపులు
మనసు లెరవులైతే మరిచప్పనే
మొనసితివంటా నిన్ను నిట్టె తిట్టితిఁగాక
పెనచి యెగ్గుపట్టితే బెరసి మొక్కేను ॥ ఇందు ॥

నగఁగానె సరసాన నయమెక్కుఁ దీపులు
సొగయకుండితేఁ దమచూపులేవెట్ట
తగిలితివంటా నీముందల నేముట్టితిఁగాక
బిగువింతగలిగితే పిలిచి మొక్కేను ॥ ఇందు ॥

మెలసి కూచుండగానె మేకొను కూటములు
గుఱుతులు సోఁకకున్న కూడదువాని
నెఱి శ్రీవెంకటేశ మన్నించఁగా గూడితిఁగాక
తఱి నలసితినంటే దగ్గరి మొక్కేను. ॥ ఇందు ॥ 211

## శ్రీరాగం

మిక్కుటపు సరసాలు మించి మొగచాటయ్యె
దక్కినట్టి కాఁపురానఁ దనిసివున్నారము ॥ పల్లవి

కొలువుపతిమెల్లా గోడచేరువులెకాక
కలయిక రతులకుఁ గారణమేమి
వల చెల గొంసువట్టి వద్దనరే రమణుని
తలఁగక కన్నులనే తనిసివున్నారము ॥ మిక్కు

తోడునీడ సతులెల్లా తోఁటబొమ్మలెకాక
వేడుక కూటములకు వెలవెట్టేరా
చూడకు మనసె వొత్తి సొలపులనాయకుని
వాడుపడ్డ ఆసలనే తనిసివున్నారము ॥ మిక్కు

సిగ్గువడ్డ కాంతలెల్లా చిత్తరుయూపులెకాక
ఒగ్గరి చేఁతలుసేయ దమయాటలా
ఒగ్గమై శ్రీవెంకటేశు నన్నిటా మీరుమెచ్చరే
తగ్గక నేఁడిట్టైకూడె తనిసివున్నారము. ॥ మిక్కు ॥ 21

## లలిత

ఏలపంతాలాడేవు యింతితోను
తాలి గరగించే నిన్ను అట్టుసేయవచ్చునా ॥ పల్లవి

మాటల దూరఁగలేక మగువ గోర నొత్తితే
నాఁటెనంటా నీవేల సన్నలఁ దిట్టేవు
చాటిచెప్పె నింతేకాక సాదుఁగొయ్యతనమున
జూటుఁ దనమున నిన్నుసూడుపట్టవచ్చెనా ॥ ఏల

బొమ్మల జంకించలేక పువ్వుల వేసితేను
తమ్మిమోము దాఁకెనంటాఁ దట్టేవు రొమ్ము
చిమ్మి నవ్వితేనె మాయసిగ్గుతోడి చిత్తమున
అమ్మరో నీతోడి చయ్యాటలకువచ్చెనా ॥ ఏల

...రింపించఁగలేక వెసవిన్నుఁగూడితేను
నేసకొప్పు జారెనంటాఁ జెలరేఁగేవు
ఆసల శ్రీవెంకటేశ ఆపె నీవు నొక్కటే
దాసలు నీవిచ్చినవి పచారించవచ్చెనా. ॥ ఏల ॥ 213

రీతిగౌ

...తలు పూవకపూచె కావకకాచె
రతుల మెప్పించేఁగాని రారాదా లోనికి ॥ పల్లవి ॥

...ంతలేదు వింతలేదు చెక్కుచేతితో నేను
పొంత నీరూపే తలపోసేనదే
మంతనాన నీవేల మాటలనే తనిపేవు
...ంతులుసేయక యింక రారాదా లోనికి ॥ కత ॥

వాడాలేదు పీడాలేదు వచ్చేవంటా నీరాకకు
తోడనే యెదురుచూచే తొలఁగకిదే
పేడగా నాకు నిట్టె యిచ్చకాలాడేవు నీ
రాడువచ్చి ముంతచొచ్చె రారాదా లోనికి ॥ కత ॥

యీసులేదు రేసులేదు యిపుడునీవుగూడఁగా
ఆసల నలపుదేరే నన్నిటానిదే
నేసవెట్టేదెందాఁకా శ్రీవెంకటేశ నీవు
రాసికెక్కితివిన్నిటా రారాదా లోనికి. ॥ కత ॥ 214

ఆహిరి

ఏమిసేసినాఁ జేయనీ యియ్యకొనవే
వేమరు నింతగలదా విభునితోను ॥ పల్లవి ॥

వచ్చినట్టె వచ్చితేను వలపేపో సుఖము
హెచ్చి మాటలాడితే నెరఁగఁగాని
కుచ్చిపట్టి నాయకుఁడు కొంగువట్టి తియ్యఁగాను
పచ్చిగానుఁ బెనఁగేవు పాసివుండఁ గలవా ॥ ఏమి ॥

చెప్పినట్టు సేసితేను చిత్తమేపో చుటము
యెప్పుడూ నొక్కారమైతే నెరఁగఁగాని
వొప్పుగా నాయకుఁడు వొడఁబరచఁగా నీవు
తప్పులెంచే వప్పటిని తాలిమికిఁ గలవా

మెట్టినట్టే మెట్టితేను మీకు మీకే పెండ్లి
యిట్టె సిగ్గులు వడితే నెరఁగఁగాని
వొట్టుక శ్రీవెంకటేశుఁ డొనగూడె నిన్నును
గుట్టులోఁద నవ్వేవు గురిసేయఁ గలవా. ॥ ఏమి ॥ 2

శుద్ధవసంతం

యువతి మచ్చరమున నెతులాడితి నేను
పవళించ నేల నీకుఁ బంతమిచ్చేమయ్యా ॥ పల్ల ॥

నిన్ను నంటినట్టివారు నీయంతవారు
యెన్నిమైనా నేము వెంగే లేలాడేము
చిన్నఁబోవ నీకేల చిత్తమురానున్నఁ గన
సన్నివారిమారు నీకుఁ బంతమిచ్చేమయ్యా

నీవూడిగములవారు నీకంటె ఘనులు
వేవేలకు వారినేల వేసరించేము
నీవు వాదనేలందుకు నేఁడుగావలసితేను
భావించి వారికి నీకు బంతమిచ్చేమయ్యా

నీసరిభోగపువారు నీవారు మాకును
వీసమంత పనికేల వేరు సేసేము
యీసుదీర శ్రీ వెంకటేశ మమ్ముఁగూడితివి
బాసతో నీ కింతైతే పంతమిచ్చేమయ్యా. ॥ సవ ॥ 2

237-వ రేకు నాదరామక్రియ

ఎచటనుండివచ్చితి వెదురుచూచితి నీకు
రచనమన్నించి నన్ను రవ్వగాఁజేసితివి ॥ పల్లవి

కొండలరాయఁడ నన్నుఁ గోరి వలపించితివి
నిండు నాతలపోఁతలు నీకె కలవు
దండి విరహము రేఁచి తనవేలనేసితివి
అండనే నాచిరుఁజెమటది నీకె కలవు ॥ ఎచ ॥

నేఁటివిభుఁడ నన్ను నిరుతుగా నేలితివి
నేనెట్లనుండినాను నీకె కలవు
అనుకొని యింతేసి ఆసలను పెట్టితివి
పూనిన పులకమోపులు నీకె కలవు ॥ ఎచ ॥

శ్రీవెంకటేశుఁడ నన్ను నేసవెట్టి కూడితివి
నీవద్ద నలసినది నీకె కలవు
కైవసము చేసుకొని కంమువఁ జొక్కితివి
యీవిధాల నేభోగించేదిది నీకె కలవు. ॥ ఎచ ॥ 217

ఘారి

కప్పురవిడెమియ్యఁగాఁ గాదనరాదు
తప్పులేమి నీయందు తగిలితి నిన్నును ॥ పల్లవి ॥

చెచ్చెర నీవు చేసినచేఁతలు వింటి నీవిందు
వచ్చేనని చెప్పఁగా వద్దనరాదు
యిచ్చకములాడేవారి నిటు రమ్మందురుగాన
విచ్చేయుమా యింటికిప్పై వింటిమి నీమాఁటలు ॥ కప్పు ॥

చెంగట నీసతిఁగంటి సిగ్గువడి అంతలో నా
కొంగువట్టఁగా నిన్నుఁ గోపించరాదు
ముంగిట వేఁడుకొండేను మొగమోడుదురుగాన
అంగవించె రావయ్య అలుకలు దేరెను ॥ కప్పు ॥

మెంచుకొంటి నీగుణాలు యిందరూఁజూడఁగా నా
కంచముపొత్తుకు రాఁగాఁ గాదనరాదు
అంచెల శ్రీవెంకటేశ అప్పై నన్నేలితిగాన
యించుకించుకె నవ్వేను యియ్యకొంటినుద్దులు. ॥ కప్పు ॥ 218

## రామక్రియ

ఏఁటికి విచారమిఁక నాకు
కూటములే నను గురిసేసీని
మేపున నేనేమి నెఱఁగకుండినా
నీపయి తలఁపులు నేర్పీని
మాపుదాఁక మైమఱచివుండినా
దాపగు వలపులు తలపించీని ॥ ఏఁ
అసురుసురయి నేనటు కనుదొక్కిన
కొసరి కలలు మేల్కొలిపీని
ముసరుసిగ్గులై మోనాననుండిన
పస నీపనులై పాదించీని ॥ ఏఁ
అలమితి రతి నేనలసినాను నీ
తెలిమోవి దప్పిదేర్చీని
యెలమిని శ్రీవెంకటేశ నాకరమ
గలిగినా నీదయగాచీ నన్నును. ॥ ఏఁటి ॥ 2

## శంకరాభరణం

ఊడిగాలు సేసుకొంటా నుండనీవయ్యా
దాదివెట్టినిన్నుఁ బట్టేవాన నీకుఁబ్రియమా ॥ పల్లవి
చెప్పినట్టె యేపనైనాఁ జేయఁగాఁ గొంప వద్దేవు
వుప్పటించె యీపనైతె నోపఁగలనా
ముప్పిరిగొన్నసతులు ముయ్యేడువారున్నారు
తప్పులు నిన్నుఁ బట్టేటి దానను నేఁబ్రియమా ॥ ఊడి
లోనై నీకు నుండఁగాను లోనింటికిఁ బిలిచేవు
కోనల నిందుకు నియ్యకొనఁగలనా
రానిపోని మూలలను రాచివాసాలున్నవారు
తానకమై మారుకొనేదాన నీకుఁబ్రియమా ॥ ఊడి ॥

గంటము నీకుఁ బాయఁగాఁ గాఁగిలించి కూడితివి
అందుకొని యింత అలయఁగఁ గలనా
యిందుకే శ్రీవెంకటేశ యిదే గోపికలున్నారు
యిందువంటి రాజసపుదాన నీకుఁ బ్రియమా. ॥ కూడి ॥ 220

ముఖారి

సిగ్గువడ నీకేల చింతలేలా ॥ పల్లవి ॥
తగ్గు మొగ్గులేని నీకు తలవంచ నేఁటికి

చిన్న చిన్న ముద్దులెల్లా వెల్లవిరి సేసేనంటే
కన్నుల జంకించి చూచి కాఁతాళించేవు
అన్నినీమోకవాకిరి నాతుమలోఁ బెట్టుకొంటే ॥సిగ్గు॥
చిన్ని నెలవుల నాకు చిరునవ్వై ముంచెను

నానాటి నీచనవు నాటించి కడిగేనంటే
కోనల ముంజేయిపట్టి కోరనాత్రేవు
పూని నీపై మచ్చరము పంట్లఁ బెట్టుకుండితేను ॥ సిగ్గు ॥
మోనాన వాంఛలెక్కి నీమోవిమీఁద నిండెను

నారిది నీమనసిది సోదించి మెచ్చేనంటే
కరఁగి కరఁగి యట్టే గారవించేవు
గరిమ శ్రీవెంకటేశ కలసితి మొక్కేనంటే ॥ సిగ్గు ॥ 221
తరితీపులై చేతికి తలఁబ్రాలై నిండెను.

దేసాళం

చిఱుత నవ్వులేల సిగ్గులు వడఁగనేల ॥ పల్లవి ॥
గుఱిఁ దలరాయిసేసుకొందమిఁక లేవయ్యా

చెప్పఁబోతేఁ బసలేవు చేసిన నీచేఁతలివి
యిప్పటి చీఁకటితప్పు లివియేకాని
వుప్పటించి యాదకుండా వూరివారికెల్లాను ॥ చిఱు ॥
చప్పుడుజాగంటవేసి చాటుదములేవయ్యా

## వరాళి

వేడుకకాఁడవు నీకు వెరపేలయ్యా
    పాడిదప్పక యిచ్చేవు పంతాలేలయ్యా ॥ పల్లవి ॥

కావరించి వేగినంతా కలిగిన పనులెల్లా
    వేవేలుఁ జేసివచ్చి వెరపేలయ్యా
    వోవరిలో నానెంకి వొంటిఁజిక్కి యిప్పుడిట్టె
    వోవలబెట్టెనంటా వొట్లేలయ్యా ॥ వేడు ॥

అంది పొంది వాడలోన అందరి యిండ్లనెల్లా
    విందులారగించి వచ్చి వెరపేలయ్యా
    బందెఁజిక్కినట్టు మాపడుపుపైఁ బవళించి
    సందడిలో వారి వీరి సాకిరులేలయ్యా ॥ వేడు ॥

అచ్చముగా నన్నుఁ గూడి అన్నిటా శ్రీవెంకటేశ
    విచ్చనవిడాయ నింక వెరపేలయ్యా
    మచ్చెము చిక్కెను నీమనసు నామీఁదను
    వొచ్చెములెల్లాఁ దీరె నొరఁబొట్లేలయ్యా. ॥ వేడు ॥ 22

## దేసాళం

ఆడుకోకు నీకునీవే అంతేసి పంతాలు
    జాడతోడ మరినవె చాలునయ్యా యిఁకను ॥ పల్లవి ॥

నిగమములై తేను నిలువఁ బెట్టేవాడవు
    మగువలతోఁ గల్లమాటలాడేవా
    అగడై అసురకాంతలందుకు సాకియున్నారు
    జగతి సత్యము లవె చాలునయ్యా యిఁకను ॥ ఆడు ॥

పెరిమ యజ్ఞభాగాలు పెద్దవై ఆరగించేవు
    అరిది వెన్నలు ముచ్చిలారగించేవా
    యిరవై గొల్లెతలెల్లా నిందుకు సాకిరున్నారు
    సరి నట్టి విశ్వాసాలె చాలునయ్యా యిఁకను ॥ ఆడు ॥

జమళి నవ్వుతా నాకు చాఁచె హస్తాలు నీవి
కొమరెలనంటి యెత్తుకొని వచ్చేవా
సమరతి రుకుమిణి సాకిరి శ్రీవెంకటేశ
సముకమైతిమి టొంకుచాలునయ్య యిఁకను. ॥ ఆడు ॥ 227

దేవగాంధారి

ఎట్టున్నదో నీచిత్తము యెరఁగ విన్నవించేను
గుట్టున నేనుండితేను కోపముగాదుసుమ్మీ ॥ పల్లవి ॥

యెగ్గులేక పతితోడ నెటువంటి వేళనైనా
సిగ్గె మూలధనము చెలులకును
వొగ్గి నీవు సారె సారె నొడివట్టి తియ్యఁగాను
దగ్గర రానైతి నిది తప్పుగాదుసుమ్మీ ॥ ఎట్టు ॥

యివ్వల మగవారితోనె మాటలాడినాను
నవ్వె మూలధనము నాతులకును
మవ్వపు సరసమున మానము సోఁకనాడఁగా
రవ్వగాఁ గేరితి నిది రాఁపుగాదుసుమ్మీ ॥ ఎట్టు ॥

సారెఁ గొప్పంటిన ప్రాణసఖునితోఁ జెనకఁగ
వోరుపె మూలధనము వువిదలకు
కోరిక శ్రీవెంకటేశ కూడి నన్ను మెచ్చఁగాను
ధీరతనుండితి నంతదిట్టఁగానుసుమ్మీ. ॥ ఎట్టు ॥ 228

9-వ రేకు హిందోళవసంతం

ఆయనాయ సుందవయ్య అన్నియుఁగంటిమి నేము
చేయి చేతఁ బట్టియ్యఁగా సిగ్గువడవలదా ॥ పల్లవి ॥

నిగ్గుల నీవంటివారు నిజమాడి బతుకఁగా
కగ్గినవేళల నేము కల్లలాడేమా
బగ్గన నంటివి నీవు బమ్మచారి నంటాను
వెగ్గళించి పదారువేలు సతులుండఁగా ॥ ఆయ ॥

కప్పురమువంటి నవ్వు కారీని వెలవుల
గొప్పగొప్పకన్నులను కోపమేఁటికే
కుప్ప సవరపుపతిఁ గొప్పువట్టి తీసితివి
నెప్పరపు వేఁటెల్లాఁ దీపుమగానవే || ఓలో ||

తేనెవంటి మాటయూరీని పెదవుల
తెలుపు నారికె నెలు దీగారిపేవే
బట్టి బంగారుపామిక బరిమి మేననాఁ(దిః)౦
యిట్టె పంచమాతనికి నెట్టువిక్రేవే || ఓలో ||

కమునవంటిది తేరలు నీమేన నివే
పాతిచన్నులనెట్టొత్తి బట్టునేవే
యీతల శ్రీవెంకటేశు నెనసితి వింతలోనే
నీతో యిప్పుడెల్లా నీవుమొక్కేవే. || ఓలో || 231

రాష్ట్రం

ఇదివో నీనారతన మేఁటివయ్యా
అవనాయ నేనేమైనా నావఁజెల్లినయ్యా || పల్లవి ||

నావిన్నుఁ జూపి నాపె నవ్వి తలపించేవు
యీపెను నీ జాణతన మేఁటివయ్యా
అదిగో నాపె మాతికనై వచ్చితి నీవద్దికి
పాదుగా నన్నింతనేసి పరాకైతివేమయ్యా || ఇది ||

మచ్చాలువేసి నాపె మాటలాడేవు నీపైతే
యిచ్చట నీ జాణతన మేఁటివయ్యా
నెచ్చెలింటికి రమ్మంటే నీవు నన్ను ముట్టితివి
అచ్చలాన గుట్టునేవదేమయ్యా || ఇది ||

వెల్లవిరినేసి నాపె వింత నీ జాణతనాలు
యిల్లిదె శ్రీవెంకటేశ యేఁటివయ్యా
తొల్లె యాపెఁగూడి జెల్లెల నన్నుఁగూడితి
వుల్లసాన మెచ్చేవు నీ వుపమిదేమయ్యా. || ఇది || 232

## రామక్రియ

చలము రేఁగేదెల్లా సవతుల కింతేకాక
నెలకొనె నాతఁడిదే నెరవేరెనే ॥ పల్లవి

ఘాతల నందరితోడ కడు నవ్వులు నవ్వేవు
చేతికి లోనాయఁ బతి చెల్లులేవే
పోతరించి యప్పటి విప్పుడు మాఱుమంసేవు
నీతితో నాతఁడుమేలు నీకె మేతే ॥ చల

పెనకుచాఁ బగటుతో చెలరేఁగి వుందానవు
అనువాయ నీ దొగట (ద?) లారేవే
కనుసన్నఁ జెలులతో కమ్మర మాటాడేవు
చనవు నీకాతఁడిచ్చె జయము చేకొంటివే ॥ చల

తావున నాకును మంచితనములు నెరపేవు
శ్రీ వేంకటేశుఁడే బుద్ధిచెప్పలేవే
వేవేలకు రాజసాన విఱ్ఱవీఁగే వన్నిటాను
కైవసమాయ నాతఁడె ఘనురాలవాదువే. ॥ చల ॥

## నాదరామక్రియ

నిచ్చలు సేపలుసేసి నేనే వేసరితి
అచ్చలానఁ దనకంటే ఆలసితిని ॥ పల్లవి

కన్నుల వాఁకలుదీర కప్పురము చరమవే
మెన్నిక నెవ్వతెకో యెదురుచూచె
సన్నలుచేసిన చేయి సకియరో పిసుకవే
పన్ని సారె వంచి వంచి బడలినాఁడు ॥ నిచ్చ

పెదవికిఁ బదనురాఁ బిలిచి పన్నీరివే
కదిసి యెవ్వతెకో కతలు చెప్పె
పొదిగినమేనఁ దట్టుపునుఁగయినాఁ బూయవే
మదనగరిడి సదమదమైనాఁడు ॥ నిచ్చ

పురముమీఁదికి నిచ్చె వుపచారాలు సేయవే
మురసి చన్నుమోపు మోఁచినాఁడు
యిరవై శ్రీ వెంకటేశుఁ డెనసె నాకాఁగిట
మరిగించి సన్నిష్లా మన్నించినాఁడు. ॥ నిచ్చ ॥ 234

౧-వ రేకు దేసాక్షి

కానీవయ్యా వానికేమి కర్తవు నీవు
తానకమైతిమి యింకా దండనుండేమయ్యా ॥ పల్లవి ॥

చతురుఁడ వన్నిటాను సముకాన సున్నదాన
రతికిఁ బిలువవంటా రవ్వసేసేనా
గతి నీవె మాకు మరి కాఁతాళించి నేసేదేమి
తతివచ్చినందాఁక దండనుండేమయ్యా ॥ కానీ ॥

నేరుపరి వన్నిటాను నీకుఁ గట్టితి నేఁ దాళి
పేరి మాటాడకున్నాఁ జెచ్చెరఁ దిట్టేనా
కోరినకోరిక నీవు గుంపించి నేసేదేమి
తారుకాణైనదాఁకా నీదండనుండేమయ్యా ॥ కానీ ॥

బలువుఁడ వన్నిటాను పట్టితి వ్రతము నీకు
అలయఁ గూడితి విఁక నొఁగాదనేనా
యిల శ్రీ వెంకటేశుఁడ వెప్పుడూఁ జేసేదేమి
తలఁపు నిలుపు దాఁకా దండనుండేమయ్యా. ॥ కానీ ॥ 235

నారణి

ఇల్లాండ్లేరిఁగిరా యింతేసి సోదించ
కల్లలు నిజాలుసేయఁ గడకూ నేరుతువు ॥ పల్లవి ॥

చెప్పరాని కూరిమితో చేరి నావద్దనుందువు
యెప్పుడో ఆపె యింటికి నేఁగి వత్తువు
చొప్పులు నీమేన నవె చూపి చెప్పరాదు మాయ
సెప్పున నీవాళ్లి కల్ల నీవె యెరుఁగుదువు ॥ ఇల్లా ॥

అరిది నాపొత్తున నీవారగించె వుందువు
నరినాపె విందెప్పుడో చవి చూపువు
సరవులె అట్టున్నవి చాటిచెప్ప గురిలేపు
నిరతపు నీసుద్దులు నీవె యెఱుగుదువు
శ్రీ వెంకటేశ నన్ను చేకొని కూడించుదువు
యేవేళనో కాని నావె తెరవిత్తువు
ధావనలె యింతేకాని పచారించరాదు మరి
నీవిధములన్నియును నీవె యెఱుగుదువు.

లలిత

ఏదఁజూచినా నీకు నేమి వాఁకి
అదానీదాఁ దిపుగఁగా నగ్గువాయ వలపు
చెంగావిమోవి నీది నెలవి నవ్వులు నావి
యెంగిలి పొత్తులపతి వేమనేమయ్యా
కొంగు వట్టేవేల నీవు కొనవేలు నేఁ బట్టఁగా
జంగిలి సతులకెల్లా చవుకాయ వలపు
చెక్కుల రేకలు నీవి సిగ్గుల రాసులు నావి
యెక్కరింత పతివైతి వేమనేమయ్యా
కక్కసించేవు రతికి కదుఁదమకించే నేను
చక్కని యింతుల మీఁద జాజరాయ వలపు
గుట్టుతో నలపు నీది కూడిన కాఁగిలి నాది
యిట్టి శ్రీవెంకటపతి వేమనేమయ్యా
పట్టేవు నాకుచములు పయ్యద నేఁగప్పఁగాను
జట్టిగొన్న మొక్కులకు సందెఁడాయ వలపు. ॥ ఏద ॥ 2:37

కేదారగౌళ

నీకంటె వేగిరము నిందు నావేడుకలివి
కైకొనేఁగాని పయ్యద గప్పనియ్యవయ్యా ॥ పల్లవి ॥

చెప్పినట్టు సేసేఁగాని చెక్కు నొక్కనియ్యవయ్య
అ(అః)ప్పుడె నవ్వేఁగాని మోవాననీవయ్య
దప్పులు దేరిచేఁగాని తమ్ములమిడనీవయ్య
గుప్పేఁగాని వలపులు గోరొత్తనీవయ్య ॥ నీకం ॥

సమ్మతించి వుండేఁగాని చన్నుల నొత్తనీవయ్య
తెమ్మగా మొక్కేఁగాని తిట్టనీవయ్య
దుమ్మరించేఁగాని మేలు కొప్పువట్టనీవయ్య
చిమ్మేఁగాని సిగ్గులెల్లాఁ జెనకనీవయ్యా ॥ నీకం ॥

యెదురు మాటాడఁగాని యేకతము వినవయ్య
అదను చెప్పేఁగాని అంటనీవయ్య
పొదిగేఁగాని అలసి బుసకొట్టనీవయ్య
యిదివో శ్రీవెంకటేశ యెనసితివయ్యా. ॥ నీకం ॥ 238

## కాంభోది

ఇంతేసి సేసేదెల్లా నింపు కొరకా
పంతము నెరపఁబోయి భ్రమసేవు నీవును ॥ పల్లవి ॥

చనుఁగవ దాఁకించేవు సారెఁ బాదపువేలను
గునుకుచు నీపల్లకి గొలిచిరాఁగా
తనువెల్లఁ జెమరించి తప్పక నిన్నుఁ జూచితే
కనుఁగొనలతేటలఁ గరగేవు నీవును ॥ ఇంతే ॥

కుచ్చులపై నుమిసేవు కోరి నీతమ్మరసము
నెచ్చెలిచేకాళాఁజి నేఁబట్టఁగా
ముచ్చటతో సిగ్గువడి మోవ నిన్నుఁ దిట్టితే
అచ్చుమోవఁ బరవస మందేవు నీవును ॥ ఇంతే ॥

చెక్కు మోవినంటించేవు చేవదేరిన యాసతో
కక్కసించి నీపాదిగాలు నేయఁగా
అక్కుపై శ్రీవెంకటేశ అలమేల్మంగను నేను
గక్కననే యలసేవు కలయుచు నీవును. ॥ ఇంతే ॥ 239

చ॥

కప్పురమిచ్చితే నీకుఁ గారమాయనా
యిప్పుడు నీభాగ్యానకు నేమి నేసునే ॥ పల్లవి ॥

చెలిమిచేసేవేళ చెక్కునొక్కి వేఁడుకొంటే
అలిగి విభునిఁ దిట్టే వదేమె నీవు
కొలఁదిమీరి తప్పు కొనగోరు దాఁకితేను
యెలమి నింతలో నితఁడేమి నేసునే ॥ కప్పు ॥

చేరి బుద్ధిచెప్పేవేళ చెవిలో మాటాడితేను
ఆరయఁ దప్పక చూచే వదేమె నీవు
మారులేక అవియె నీమర్మములు సోఁకితేను
యీరీతి నింకా నితఁడేమి నేసునే

మోవితేనె విందువేళ మొనపల్లు సోఁకితేను
ఆవల చూచి నవ్వేవు అదేమె నీవు
నీవె అలమేల్మంగవు నిన్నేలె శ్రీవెంకటేశుఁ
డీవేళను ఆయ నాతఁడేమి నేసునే. ॥ కప్పు ॥ 240

241-వ రేకు సామంతం

వింత లాపెవద్దనుండి వినీఁ గాని
యింతయు మాతో నానతియ్యవయ్య నీవు ॥ పల్లవి ॥

చెప్పినట్టె నేసి తెలిసిగ్గువడి వున్నదింతె
అప్పుడె మెచ్చెఁజుమ్మీ ఆపె నిన్ను
కప్పురగంధి మతిలోఁగలమాట నేమాదేము
చెప్పేమాటలు మాతోనె చెప్పవయ్య నీవు ॥ వింత ॥

మన్నించితి వన్నిటాను మనసు వచ్చేవున్నది
కన్నులనె మొక్కెఁజుమ్మీ కాంత నీకు
సన్నలు నేసినవెల్లా సరినేము దెలిపేము
యిన్నియు మాకుత్తరము లియ్యవయ్య నీవు ॥ వింత ॥

కాఁగిటఁ గూడితి విదె కైకొనె నలమేల్మంగ
అఁగి వురమెక్కెఁ జుమ్మీ ఆపె నిన్నంటి
వేఁగము శ్రీవెంకటేశ విన్నవించే మిఁక నీతో
పోఁగు వోఁగుఁ దొంత మమ్ముఁ బొందించుమీ నీవు. ॥వింత॥ 241

పాడి

దేవుఁడు దేవియు నదె తెరదియ్యరె
పూవుబంతులు దీసి పువ్వులియ్యరే ॥ పల్లవి ॥

వెన్నెల నిద్దిరదేర గక్కన మేలుకొని
వున్నతి మొకాలు చూచే రొకరొకరు
వన్నె రందియ్యరె పావడలు నందియ్యరె
గన్నఁ గాళాంజి దగ్గరఁ బెట్టరే ॥ దేవు ॥

సవులు నగుకొంటా నంటున లేచి కూచుండి
వాగిఁ గురులు దిద్దే రొకరొకరు
తగ నద్దాలు చూపరె తలితో దాగాలియ్యరె
వొగరుదేరఁ గస్తూరి వుండ లియ్యరే ॥ దేవు ॥

డగ్గఁ గాఁగిలించుకొంటా ప్రియములె ఆడుకొంటా
వొగ్గిరి రతులకును వొకరొకరు
అగ్గమై శ్రీవెంకటేశుఁ దలమేలుమంగాఁ గూడి
వెగ్గళించే రలపార విసరరే యిపుడు. ॥ దేవు ॥ 242

రామక్రియ

గడుసుఁదన మేఁటికి కలికి మోనమటే
తడవకున్న దిట్టతన మిదియనఁడా ॥ పల్లవి ॥

పంతమాడరాదుగాక పతితోడ సతికిని
అంతరంగమైనఁ గొంత ఆనతీరాదా
మంతుకెక్కి వద్దనుండి మారుత్తరాలియ్య విదే
కాంతుఁడు నీకిదియెల్లా గర్వముగాఁ జూడఁడా

తిట్టరామగా కతని( దేరిచూచి నీకింతేసి
తెట్టెలగా మొక్కు(గాను దీవించరాదా
చెట్టవట్టి పెన(గ(గా( జెప్పు(గదే వినయాలు
నుట్టుకోక నుండితేను నువ్వితే మిదన(నా ॥ గసు ॥

వాధించరామిగాని బది శ్రీవెంకటేశ్వరు(
వామిగాను మెచ్చి మెచ్చి పావరాదా
యీదెస నలమేల్మంగ వెనసితి వితని
పోదితో నియుగాకున్న పొరపొచ్చ మెంచ(వా. ॥ గసు ॥ 2

దేసాళం

అన్నిటికి( గలవట అంటుకులేవా నీవు
నిన్ను నీవె యెంచుకొంటే నేరవా యీపనులు ॥ పల్లవి ॥

నవ్వులకు నొకమాట నంటున నీతో నాడితే
యివ్వల నంటుకు(గాను యెగ్గవట్టేవు
రవ్వైనవా(డవుగావా రాజవుగావా మున్నె
అవ్వల నెంచిచూచితే నంటుకును( దగవా ॥ అన్ని ॥

చెలిమితో నొకమా(టు చెక్కుచేత నూ(దితేను
కల(గి నీలోనిదే కా(తాళించేవు
వలపు నీసొమ్మగావా వాడికవా(డవుగావా
అలవాటు నీకులేదా అందుకును( దగవా ॥ అన్ని ॥

చనవుల నొకమా(టు చన్నుల నేనొత్తితేను
కొనచూపులనే చూచి కూడితి విట్టె
విను శ్రీవెంకటాద్రి గోవిందు(డవు నీవుగావా
అనిపించుకో మాచే నందుకును( దగవా. ॥ అన్ని ॥ 21

శుద్ధదేసి

కా(తాళించి వున్నది నీకడ సుద్దులెల్లా విని
చే(తలేమి( జూపక చేరి వూరకుండుమీ ॥ పల్ల

వనిత నీచిత్తము రావలసి యిందాఁకాను
వొనర నన్నిమాఁటలు నోరిచెఁగాని
చెనకి నీవె యిఁక చేతులెత్తి మొక్కినాను
కొనచూపులనుసలఁ గుచ్చి మెత్తుఁ జుమ్మీ ॥ కాఁతా ॥

అతివ నిన్ను మెప్పించె అంమకార కిందాఁకాను
చతురత మోనసులు జరపెఁగాని
యితవుగా నీవె యిఁక నిచ్చరము లాడినాను
రతిరాజు గుద్దాల నోరనే తోయఁజుమ్మీ ॥ కాఁతా ॥

నీవు గూడిన సిగ్గున నిందాఁకా
మొలకనవ్వులు లోలో మొరఁనెఁగాని
నెలవై శ్రీ వెంకటేశ నీవె యెంతవేఁడుకొన్నా
తలిరు మోవిపెని ముద్దులు వెట్టుజుమ్మీ. ॥ కాఁతా ॥ 245

సామంతం

ఏమొక జాదవారము మీరలేము మీమాటలు
ఆమాటలు నెరపితే నందరికి నమ్మికా ॥ పల్లవి ॥

డిమి నాకాంతాలు పొగడేవు సారె సారె
నాఁడె నీవిచ్చిన బుద్ధి నాకుఁ గద్దుగా
కోఁడి నన్ను లోనుసేసుకొని నీయిచ్చఁ దిరిగి
ఆఁడుజాతి కిదేచాలు అంటె వారోపుతురా ॥ ము ॥

రిచి నన్నిందరిలో పెద్దరికము సేసేవు
తొలుతె చేపట్టితిగా తూరి రక్షించ
యిల నన్నొకఁ బరచి యింపరినిఁ బెండ్లాడి
పొలమెల్లా నిద్దె చుట్టుకొంటె వారోరుతురా ॥ ము ॥

డి నన్ను నారతులె గురుతులు సేసాదేవు
జోడు గద్దుగా నిన్నుఁ జూపి చెప్పను
యీడనె శ్రీ వెంకటేశ యేలితివి నన్ని(న్ను?)మాటి
వాడకెల్లా నేర్పెనంటె వారిందు కోపుతురా. ॥ మేము ॥ 246

242-వ రేకు

సాళంగనాట

అద నీవ నుండఁగా నిన్న నేఁగాక
కూడి యిట్టె వుండితేను కోపగించేనా ॥పల్లవి॥

నా మొగము చూచుమా నగితేనె కానవచ్చీ
నీ మనసులోనవున్న నిజముఁ గల్లా
యేమతకములు నేల యింతేసి అనరేం
నామంచముమీఁద నుండే నమ్మ నే ననేనా ॥అద॥

ముమ్మారునాదుమామాట మొదలనే తెలిసెను
కమ్మిన నీచేఁతల కపటాలెల్లా
సమ్మతించు మననేల చలము సాధించనేం
యిమ్ముల మాయిచ్చనుండే యీసడించేనా ॥అద॥

కాఁగిలించుకుండుమా కాఁకలో నెముంచుకొని
ఆఁగి పెదవి వడిపె అసలెల్లాను
వీఁగనేల యిఁకను శ్రీవెంకటేశ కూడితివి
పాఁగి యిట్టె నెలకొంటె దాసలాడిగేనా. ॥అద॥ 21

వరాళి

ఆసపడ్డవారికి నలమట నేయకిఁక
రాసికెక్క మన్నించి రక్షించవయ్యా ॥పల్లవి॥

నీమొగము చూచి చెలి నిట్టూర్పు నిగుడించె
యేమో అడుగవయ్య యేకతానను
సాముదార నెలవినె నవ్వులు లోలోనదాఁచీ
దీమసాన తలఁపెల్లాఁ దెలుసుకోవయ్యా ॥అస॥

చేతికి విడెమిచ్చి చెమరించీ మేనెల్లా
యేతున నేమడిగెనో యియ్యవయ్యా
ఆతుమలోఁ గోరి కోరి అట్టె నివ్వెరగందీ
కాతరాన నట్లానె కానిమ్మనవయ్యా ॥అస॥

నిగ్గరఁ జూచుండి యదె తలవంచీ సిగ్గువడి
వెగ్గళించి నీకఁ జెరవేయవయ్యా
యిగ్గుల శ్రీవెంకటేశ కాఁగిట నిన్నింతి గూడె
వొగ్గినరతులకు నీ వొడిగట్టవయ్యా. ॥ ఆస ॥ 248

ఆహిరి

విచ్చి చెప్పఁ గదె నీకు విపరముగా నేఁడు
నెచ్చెలి నిన్నిటికిని నేనేసరి సుమ్మీ ॥ పల్లవి ॥

అంగవించి నీతో మాటలాడక యిద్దెవున్నది
అంగన చిత్తము దెలియఁగఁ గలవా
యెంగిలిమోవితోడ నేమిమాటలాడినాను
పంగించె యెంతైనా సంతుషాయదంటాఁ జుమ్మీ ॥ విచ్చి ॥

తరుణి యెదుటనె తలవంచుక వున్నది
వెరవున నీపెను నవ్వించఁ గలవా
సరసము లాడితేను జంగిలి కనుపులోనఁ
దొరలితేనది గనుదోసమనీ సుమ్మీ ॥ విచ్చి ॥

కామిని శ్రీవెంకటేశ కాఁగిటఁ గలసె నేఁడు
చేముంచి ఆకారణము చెప్పఁ గలవా
వాములై యెవ్వతెకైనా వయసు మీఁదువోతేను
దీమసాన నిన్నే నిందింతురంటాఁ జుమ్మీ. ॥ విచ్చి ॥ 249

శుద్ధవసంతం

అందుకెపో నిన్ననేది అన్నిటా నేను
యెందుకైనా వెరవవు యెప్పుడూ నీవూ ॥ పల్లవి ॥

నివ్వటిల్ల నాకైతె నిన్నుఁ జూచినప్పుడెల్లా
నవ్వులె గనమాయ నానాటికి
జవ్వనపువాఁడవు సవరనివాఁడవు
రవ్వలకు వెరవవు రచ్చలనెల్లాను ॥ అందు ॥

తాటించి నిన్ను నేను దగ్గరిన యప్పుడెల్లా
మాటలె గనమాయ మరి నోరికి
నీటుతోడివాఁడవు నేరుపరివాఁడవు
యేట్కైనా వెరనవు యీడా నాడను ॥ అందు ॥

అంకెల నిన్నుఁ గాఁగిట నలమిన యప్పుడెల్లా
జంకెనలె మిగిలెను సారె సారెకు
పొంకపు శ్రీవెంకటేశ పురుషోత్తముఁడవు
లంకెలకు వెరవవు లలనలయెడను. ॥ అందు ॥ 250

నాదరామక్రియ

ఇంకా నేమిగావలె నిట్టె ఆనతీవయ్య
జంకించఁగాని నీసలిగె చూపేను ॥ పల్లవి ॥

మతకము నేరఁగాని మంతనాన నీతోను
చతురతమిగులఁ గొసర నేరుతు
బతిమాలనోపఁగాని పంతపు నీరతివేళ
నితవై నీచెప్పినట్టు యేమైనాఁ జేసేను ॥ ఇంకా ॥

వాదించరాఁగాని వన్నెలుమెరసి నీతో
ఆదిగొని సరసము లాడవచ్చేను
సాదించవద్దుగాని చల్లని నీకాఁగిటిలో
సాదువలె నీకతలు సమ్మతించేను ॥ ఇంకా ॥

కోపగించఁగాని నిన్నుఁ గూరిమి శ్రీవెంకటేశ
కాఁపురము నేసి నీపక్కనె వుండేను
యేపున బింకము లేల యిట్టె నన్నుఁ గూడితివి
తీపులమోవిమాటలఁ దేనె వూసేను. ॥ ఇంకా ॥ 251

ముఖారి

పదరకువె యింకాఁ బనిగలదు
కదియుట నిన్ను నాపై కాఁతాళముగాదా ॥ పల్లవి ॥

కన్నుల నవ్వితే నేమె కాఁకలు చల్లితే నేమె
వన్నెల మాయింటికి రావలెఁగా తానూ
యెన్నిలేవు వానియెమ్మె లెవ్వరుండిరో వద్దను
నిన్ను నాతఁడేమనినా నన్ను నంటగాదా ॥ పద ॥

సేసలు వెట్టితే నేమె చేతులు ముట్టితే నేమె
వాసుల నామోము చూడవలెఁగా తానూ
వేసాలు నెరపనీవె వీడెపు మదమో యేమో
బాసికము నీకిచ్చిన పని నాకేకాదా ॥ పద ॥

ఆడ నిన్నంటితే నేమె అట్టె తావచ్చితే నేమె
వాడుమోము నాకుఁ జూపవలెఁగా తానూ
యీడనె శ్రీవెంకటేశుఁ డెనసెఁ గదవె నన్ను
వేడుకలక్కడివి నాతోడి తమేకాదా. ॥ పద ॥ 252

243-వ రేకు శ్రీరాగం

తొల్లిటి సుద్దులకుఁగా దూర నేఁటికి
పల్లదా లన్నియునాడి పంతమిచ్చెఁ జాలును ॥ పల్లవి ॥

చెక్కునబెట్టిన చేయి సేసపెట్టినట్టి చేయి
వొక్కటెకాదా మన నొండు రెండాయ
నిక్కి తానేమి సేసునె నేఁడు నాభాగ్యముగాక
మొక్కితి ననవె తానె మొకమోడె నాకును ॥ తొల్లి ॥

అప్పుడు నవ్విన మోము అలిగిన మారుమోము
యెప్పటిదెకాదా యించుముంచాయ
తప్పులు తనందునేవె దైవము చేఁతలుగాక
కప్పురము గానుకీవె కరుణించె నన్నును ॥ తొల్లి ॥

కొంచి పెనఁగిన మేను గొబ్బనఁ గూడిన మేను
యెంచఁగ నిదియెకాదా యీడుజోడాయ
వంచనేలె శ్రీవెంకటేశ్వరుఁడు తా ననుఁ గూడె
మంచివె పనులనవె మన్నించె నన్నును. ॥ తొల్లి ॥ 253

## పాడి

తాఁకనేల వంగనేల తలఁచుకో యికనైనా
సోఁకోరిచితేఁ బనులు చెప్పఁబోఁగా ॥ పల్లవి ॥

పల్లవము లాసఁగాని పంతము లియ్యవలెనె
అల్లదివో విభుఁడు నేఁ డాఁడు వారికి
మొల్లమి సేవాటియుద్ది మునుపనె కలిగెనె
వొల్లనె బోరతనాన నుండవచ్చుఁగా ॥ తాఁక ॥

చేతులు పెఁజాఁచఁగాను సిగ్గులు వడవలెనె
యేతువ లెత్తా దించుక యిందరిలోన
నీతి విచారించుకొని నెమ్మది నెట్టునమ్మంపె
రీతితోఁ బెద్దరికము రేఁచుకొనవచ్చుఁగా ॥ తాఁక ॥

కాఁగిలించుకొనఁగాని కైవసము నావలెనె
మాఁగిన మోవితేనెల మమ్ముదోఁటికి
వేఁగదేరఁ గూడితివి శ్రీవెంకటేశ నేఁడు
నాఁగువార మేఁచ మేఁచ నవ్వువచ్చుఁగా. ॥ తాఁక ॥ 251

## సామంతం

రాఁగదె పాయము రవ్వలఁ బెట్టక
కాఁగక మేఁగడ గట్టీ నటవే ॥ పల్లవి ॥

వలచిన రమణికి వడిఁ బతితోడుత
యెలమిని పంతము లేమిటికే
కలయికలకె మరి కాచుకుండఁగా
చెలరేఁగీ యతని చిత్తముగాకా ॥ రాఁగ ॥

పొగ్గి ననుపుతో నుండిన కాంతకు
యెగ్గులు దప్పులు నేమిటికే
సిగ్గుతోఁ బ్రియము చెప్పఁగఁ జెప్పఁగ
నిగ్గునఁ దా మన్నించీగాకా ॥ రాఁగ ॥

కదిసెను శ్రీ వెంకటపతితో నీకు
యెదురు మాటలిఁక నేమిటికే
పదరక వురమున జలుసుకుండఁగా
ముదములు పైపై ముంచీఁగాకా. ॥ రాఁగ ॥ 255

### శంకరాభరణం

పడఁతులు సేసినట్టి భాగ్యముకొద్ది
పుడివోనియట్టి మెన్నె వుద్యోగాలవాఁడవు ॥ పల్లవి ॥

కొత్త కొత్త సింగారాల కొనబుకాఁడవు నీవు
బత్తి వాకరిమీఁదనె పాటించేవా
యిత్తల గొల్లెతలు నాఁడెట్టు వేగించిరో నీతో
మత్తిలి నీవైతే వేయి మనసులవాఁడవు ॥ పడ ॥

పొట్టి పొద్దు వేడుకల బూమెలవాఁడవు నీవు
నుట్టి లింతెకాక వొక్కచోటనుండేవా
పుదండాలు రాచకూఁతు లోరిచి యెట్టుండిరో
గద్దరివై పూరూరి కాఁపురాలవాఁడవు ॥ పడ ॥

పిచ్చ నిచ్చఁ బోదిసేసె నేరుపువాఁడవు నీవు
యిచ్చకుఁడవై వొక్క రింటనుండేవా
మచ్చిక శ్రీ వెంకటేశ మన్నించి నన్నూఁ గూడితి
ముచ్చటలో నందరికి మోహించేవాఁడవు. ॥ పడ ॥ 256

### మధ్యమావతి

తమకించి రమణుఁడు తరిగాచుకున్నవాఁడు
సమరతి వుపరతి సాము సేసేదెపుడే ॥ పల్లవి ॥

చెనకిన చెనకులు సిగ్గులకే కొలఁదాయ
మనసిచ్చి మీలోని మాటలెపుడే
కొనచూపు లన్నియును కోరికకే మొదలాయ
చనవిచ్చి మోవితేనె చవిగొనేదెపుడే ॥ తమ ॥

ఎగసెట్టి నగవులు ననుపులకేపట్టై
పొగడువలపు గొరఁబోసె దెపుడే
బిగియించు వేడుకలు సింగారించవేపట్టై
అగపడ్డ కాఁగిటికి అయుమిఁక నెపుడే ॥ తమ ॥

కూడిన మీకూటముల గుఱుతు మేనులనించె
చూడఁజూడఁ బంతాల నించుట యెపుడే
యీడ శ్రీవేంకటేశు మీ యిచ్చకములె నింకీ
వీదెపు మెచ్చులు మెచ్చేవేఁ యెపుడే. ॥ తమ ॥ 257

ఆహిరి

ఆనతీవయ్యా యింకా ననుమానా లేఁటికి
యేనెపాలూ లేకున్న నిటువలెఁ జేసునా ॥ పల్లవి ॥

పసివాఁడు జూపులు పంచి నిన్నుఁ గొసరుచు
ననుపుసురయ్యాఁ జెలి అది యేఁటికి
మెసఁగి యుండఁగా మీరు యేకతాన నుంటిరి
కనుగొని రతులకోఁ గతమ యేమాయనో ॥ ఆన ॥

చలపంచుకొని సీతో చెమకపు మాటలాడి
సొలయుచు పంతి మొక్కి సొలగిలిని
చలిపాయ నిండాఁగా సరసము లాడితిరి
పలముతో మతికేమి సమ్మతిగాదాయనో ॥ ఆన ॥

సన్నలనె జంకించి జవ్వనపు మదమున
చన్నుఁగొన అదుమాపి సాధించీని
యిన్నిటా శ్రీవేంకటేశ యెనసితి రిద్దరును
పన్నిన మీపంతముల బలిమి యెంతాయనో. ॥ ఆన ॥ 258

211-వ రేకు దేసాక్షి

ఇద్దరికిఁ దగు తగు నిఁక నెన్నఁడూ
కొద్దిలేని పొంతనాలు గూడె మీకు నిపుడు ॥ పల్లవి ॥

పచ్చని మోవిచిగురు పందిలిపెట్టె మాటల
దిచ్చరి ముగ్గుల నించి తెరగట్టెను
పెచ్చుపెంపుల( దానె పెండ్లికూతురై వున్నది
రచ్చసేసే వెంద(కా రావయ్య లోనికి ॥ ఇట్టె ॥

పెనుమె( దిముకమున పెండ్లిపీ(ట వెట్టుకొని
వెలవి నవ్వుల నించె సేసపాలు
వలికె కన్నుల నెగవె కుడు (కొటు) కవెట్టెను
చలువగా నీకరుణ చల్లవయ్య సతికి ॥ ఇట్టె ॥

పాసుపు మీ(దికి( దీసె పాణిగ్రహణమున
నానారతుల( జేసె నాగవెల్లి
మోనాన శ్రీవెంకటేశ మోవిబువ్వాలు దొడికె
ఆనిన వేడుకలనె అందవయ్య వియ్యము. ॥ ఇట్టె ॥ 259

సాళంగనాట

పొట్టువోని వానికిట్టె బుద్ధి చెప్పవే
వుద్దండాలు చూపి మోపి పూరడించెనే ॥ పల్లవి ॥

పదుపడాడి యాత(డు సాధకు నేరుతునంటూ
పదరు(దనములనె వాదించెనే
పదరి యందుకు నేను పైకొని కొంగుపట్టితే
సదరము సేసుకొని సాదించెనే ॥ పొట్టు ॥

చలివాపి యింతలోనె సంగడి నిలువ(బెట్టి
పొలతుల( దెచ్చి నాతో( బోలించీనే
తెలిసి అప్పటి నేను దీకొని నిలిచితేను
సొలపుల సొక్కించి సోలించీనే ॥ పొట్టు ॥

అరయ శ్రీవెంకటేశు( డాయములంటి నన్ను
కోరి తన కా(గిటిలో( గూడించీనే
తేరిచూచి యీవేళ తేనెమోవి యానితేను
ఆరితేరి మారుమాట లాడించీనే. ॥ పొట్టు ॥ 260

## సామంతం

అయుగరే విభు నివె యైతేఁ గనక
విడువక మాయింటికి విచ్చేయు మనవే ॥ పల్లవి ॥

పెలుచమాటలలోని ప్రియములు
మెలిమి యెవ్వరికైనా యితవవునా
కలదింతె మావాళ్ళ కపురులు
పలుమారు తనకేవి బాతియయ్యీనా ॥ అయు ॥

మిగువరాజసముల పిలుపులు
జగముల వారలకు చవిపుట్టీనా
తగు ధన మిదియే దాఁపురమూ
అగపడె యిదినేఁడు అనువయ్యీనా ॥ అయు ॥

వింకపురతులలోని పెనఁగులు
మంకుచందాలవారికి మర్మమంటీనా
పొంకాన నన్నుఁ గూడె శ్రీవెంకటేశుఁడు
లంకెలాయ తనకిది లావయ్యీనా. ॥ అయు ॥ 261

## ధన్నాసి

ఎప్పుడు నీవారమె నేమిదె వద్దనున్నారము
అప్పగించే నందరిని అన్నిటా మన్నించుమీ ॥ పల్లవి ॥

వరుసకు వంతుకును వచ్చినవారె యిందరు
సరుసఁ బెట్టుకో నీవు చల్లఁగా నేఁడు
తరవాతి పనులకు తగు గొల్లెతలు వారె
మరుగకు మింకా నీ మనసునను ॥ ఎప్పు ॥

ఆసల బాసలవారు అదె పెండ్లికూఁతురులు
నేసుకో యింకా నీవు చేయి మీఁదుగా
రాసికి మీఁదమిక్కిలి రాకాపి సతులున్నారు
మోసమోక యేలుకో నీ మోహమునను ॥ ఎప్పు ॥

వాడికె వేడుకవారె వలచివున్నా రిందరు
కూడవయ్య్య కాఁగిటను గురుతులుగా
యీడనె శ్రీవెంకటేశ యేనసితి నిదె నేను
యీడుపెట్టి మెరయించు మిన్నిటా నీవు. ॥ ఎప్పు ॥ 262

తెలుఁగుఁ గాంభోది

ఇంకా నింకా రమణుఁడు యేమనీనె
వంక నొత్తఁబోలేను వాసివుట్టీ నాకు ॥ పల్లవి ॥

చనవు తానిచ్చినది చలముతో మాఁటాడితి
పెనఁగఁ బోయితే మరి పిరివీకుతె
తనమాఁట నామాఁట తరుణు లెరుఁగుదురు
ననిచి తదవఁబోతే నవ్వువచ్చీ నాకు ॥ ఇంకా ॥

సమ్మతించినదె తాను సరసము నేనాడితి
కమ్మరఁ గమ్మర నయితే కసిగాన్లె
నెమ్మనము లిద్దరివి నిందుక అట్టె వున్నవి
పమ్మి నొసరఁగఁబోతే పచ్చిదోఁచీ నాకు ॥ ఇంకా ॥

నేరిపె నన్నియుఁ దా నెయ్యమున నేఁగూడితి
తారుకాణించఁగఁ బోతే తగులాయమె
యీరీతి శ్రీవెంకటేశుఁ డిన్నిటాను నన్ను నేలె
పేరి చెనకఁగఁబోతే సిగ్గువచ్చీ నాకు. ॥ ఇంకా ॥ 263

కేదారగౌళ

ఎనసిన యాకెతో నీకింత యేఁటికి
వెనుకొని నావెంటనె విచ్చేయవయ్యా ॥ పల్లవి ॥

పలికినట్లనెపో పంతము
చలిమి బలిమిగల సతులకు
తలఁచినయట్లనె తగులము
వలపులు నెలకొన్నవారికెల్లాను ॥ ఎన ॥

చేసినవెల్లాఁ జెల్లు చేఁతలు
దావలు నమ్మినయట్టి పడఁతులకు
ఆసపడిన కోరిక లబ్బినపుడె
నేసవట్టుకుంకినట్టి చెలులకును ॥ ఎన ॥

చూచినట్లనెవచ్చు సూటులు
మేచి కూడిన మీవంటిద్దరికిని
చేచేత శ్రీవెంకటేశ చెలి యలమేల్మంగ
లాచి నట్లనె మించె లావణ్యాలు. ॥ ఎన ॥ 264

245-వ రేకు శ్రీరాగం

చెప్పినట్టు సేయకున్న చిన్నఁబోరాదు
కప్పురగందులకెల్లాఁ గల దిదె వాలు ॥ పల్లవి ॥

చనవు లేనిచోటి జగడాలు
పెనఁగఁబోతే పట్టి పిరివీకులు
కనుకొని మాటాడరె కాంతలు
వనితల కిందరికి వాసితోడి బతుకు ॥ చెప్పి ॥

అందియు నందనిచోటి యాసలు
సందడిఁ బెనఁగఁబోతే సటవటలు
పొందులు దెలుసుకోరె పొలఁతులు
చెందిన యింతుల కెల్ల సిగ్గే మూలధనము ॥ చెప్పి ॥

అలసిన రతిలోని యలుకలు
చలపట్టఁబోతేను సదమదము
కలసె నన్నిదె శ్రీవెంకటవిభుఁడు
లలనలకెల్లా నీలాగులెపో లంకెలు. ॥ చెప్పి ॥ 265

కాంభోది

ఏమయ్యా నే మంతేసి యెఱఁగనివారమా
కామించితే నీమాట కాదనఁగఁ దరమా ॥ పల్లవి ॥

సలిగెంత గలిగినా సరస మాడుటెకాక
మెలఁగి నీకంటె మితిమీరవచ్చునా
వలపు మిక్కిలిమైతె వసమై చొక్కుటగాక
కలఁచి కలఁచి నిన్నుఁ గక్కసించఁదగునా ॥ ఏమ ॥

సగమెంత వచ్చైన నన్నుపై యుండుటగాక
మిగులా మందెమేళాల మించనగునా
మొగమెంత చూచినా మొక్కుటె మొక్కుటగాక
యెగసక్యాలకు నిన్ను యేఁపఁదీరునా ॥ ఏమ

నీవెంత మన్నించినా నిన్నిట్టె కూడుటగాక
వేవేర నిన్నుఁ బచ్చిసేయఁగూడునా
యీవేళ శ్రీవెంకటేశ యేలితి విటు నన్ను
ఆపటించి నిన్ను రతి నలయించఁజెల్లునా. ॥ ఏమ ॥ 266

## సామంతం

అప్పటి కాఁతాళాన నందుముగాక
తిప్పఁబోతే నీగుణాలు తీరెనా మాకు ॥ పల్లవి ॥

నేరుపుననాడె కల్ల నిజమువలెనెవుండు
యేరుపరచేమంటె యెటువచ్చును
నీరచనల నీవుసు నిలువుసూరువండు
తారుకాణించే మంటె తరమా మాకు ॥ అప్ప ॥

దరిచేరి దండాలు తనవద్దనెవుండు
సరవికి దిద్దేమంటె చాయకురావు
వెరసి మెయిగురుతులు వేయిసేసు నొక్కొక్కటి
పొరసి వెలవెట్టఁగ నోపికేది మాకు ॥ అప్ప ॥

ప్రేమపు మోవితేనెలు పెదవిమీఁదనెవుంటు
చేముట్టి వడ్డించఁబోతె చిరునవ్వులు
గామిడి శ్రీవెంకటేశ కలసితి విటు నన్ను
దోమటి దొడికేమంటె దొడ్డా మాకు. ॥ అప్ప ॥ 267

## మాళవిగౌళ

విన్నపము లింత విన్నవించవలెనా
సన్నల మేలే నీవు జరపఁగవలెనా ॥ పల్లవి ॥

మాటలకు సిరిమాయ మనసులో మర్మములు
తేటల తెల్లములాయ తెలిఁగన్నులు
మేఁటికి జాణలు నేనే విన్నట నవ్వులనుండి
ఆఁటదాని అనుమానమంత నీకువలెనా ॥ విన్న ॥

చెక్కుమీఁది చేయాయ చిప్పిలఁ దమకమెల్ల
మొక్కులాయ విరహము ముంచిన యాస
తక్కులఁ బెట్టఁగనేల తరితీపు నేయుచును
చక్కని కోమలాంగికాలి నీకు వలెనా ॥ విన్న ॥

నవ్వులకు మొదలాయ నసువులోపలిసిగ్గు
రవ్వలకుఁ జోటాయ రతి చిహ్నాలు
యివ్వల శ్రీ వేంకటేశ యింతి నిట్టె కూడితివి
జవ్వని నలయించి(చనీకు?)న చలమింత వలెనా. ॥ విన్న ॥ 268

## వరాళి

వలపు నీకుపంటిది వాతరాదు
తలఁపు మాకిద్దరికె తారుకాణై వుండును ॥ పల్లవి ॥

మలసి అతఁడాడిన మాటలు నాతోఁ జెప్పి
చలము రేఁచకురె సతులాల
తెలిసితి నేఁ దొల్లె తేనె(లె?) పొన్నాకుమీఁ దివె
మెలఁగి నేఁడు గొత్తలు మీకింతె కాని ॥ వల ॥

యిదివో విభుని నన్ను నెదురుకట్లఁ జూపి
మదము పెంచకురె మగువలాల
పదరి పిండిచేరెనుఁ బంటిలోని రసములు
అదనెరఁగక మీరు అలనేరుగాని ॥ వల ॥

గక్కన శ్రీవెంకటేశు కాఁగిటిలో నన్నుఁగూర్చి
పక్కన నవ్వకురె పడఁతులాల
చిక్కెను నాకుఁ దొల్లె చెరకుపండినపండు
పెక్కుమారులు మీరు పెనఁగేరుగాని. ॥ వల ॥ 269

దేసాళం

బుద్ధిమంతుఁడ వౌదువు పూఁచి బతుకఁ గలవు
వొద్దికతో నాకేపు దొక్క మనసాయను ॥ పల్లవి ॥
యేతులు సెరపవచ్చు నెమ్మెలాడుకొనవచ్చు
నాతోడి నవ్వులె నయమా నీకు
ఆతలివారైతె నిన్ను నన్నిటాఁ గాకు సేతురు
చేతికి లోనయినవారిఁ జెనకితే మేలుగా ॥ బుద్ధి ॥
బాసలు సేయంగవచ్చు పలుమారు బొంకవచ్చు
ఆసలు మాతోడిపొందు అనువా నీకు
పోసపోని వారయితె మునుకి మయి సేతురు
వాసి మానాపతులనె వంచుకొంటేఁ జెల్లునా ॥ బుద్ధి ॥
గుట్టుసేసుకొనవచ్చు కూరిమి గొసరవచ్చు
యిట్టి మాకూటములె యితవా నీకు
అట్టుసేతు రిందరు నాఅది శ్రీ వెంకటేశ
మట్టుతోడి వారినె మన్నించితేఁ ఎగుఁగా. ॥ బుద్ధి ॥ 270

246-వ రేకు శంకరాభరణం

విచారించు కొమ్మనవే వేడుక నింకాఁ దాని
పచారించి మాతో నేల పలుక వచ్చీనే ॥ పల్లవి ॥
విరసాలె సరసాలు వేగిరపడకవుంటె
తెరమరఁగె బయలు తెలిసితేను
సరవులె వెరవులు చనవు గలిగితేను
యిరవాయఁ దా నాకు నేమి బోధించీనె ॥ విచా ॥

పంతనాలె పొంతనాలు పనులెల్లా నియ్యకొంటె
చింతలే మనోరథాలు నేసుకొంటేను
వింతలే మొవు లవును మేసినట్టె వేసితేను
యెంత నేసి నన్నుఁదాను యేమిటోధించీనే

॥ విచా ॥

వెగటులే పగటులు వెరపులులేకున్న
లెగువలే నగవులు దిద్దికొంటేను
తగు శ్రీ వెంకటేశుఁడు తమకించి నన్నుఁగూడె
మొగసక్కె లిఁకలేవు యేమి బోధించీనే.

॥ విచా ॥ 27

వరాళి

గుట్టుతోడిదాన నేను కొసరనేల
దిట్టతనమె నాది తెలుసుకొనవయ్యా

॥ పల్లవి ॥

పెక్కుమాట లాడఁగాను ప్రియుఁడ నీతో నేను
వొక్కటి హితవౌను వేరొక్కటిగాదు
చక్కటులు నీవాఁడితే సారెకు విననేఁగాని
అక్కరతో మారుమాట లడుగకువయ్యా

॥ గుట్టు ॥

సారె నీతో నవ్వఁగాను చప్పనవునో వుప్పనవునో
తేరకొనని మనసు తిద్దుకోరాదు
కేరి నీవు నవ్వితేను కిమ్ముల( జూచేఁగాని
అరయ నన్నుఁ గలపే వంతయేఁటికయ్యా

॥ గుట్టు ॥

నిన్ను బాసగొనఁగాను నిలుపుదువోమరి
సన్నలఁ దోతువో అంతసాధించనేల
మెన్నఁగ నన్నుఁ గూడితి విదిగో శ్రీ వెంకటేశ
వెన్నవంటి నయముతో వేఁడుకోనేలయ్యా.

॥ గుట్టు ॥ 272

ముఖారి

ఎవ్వరి కెవ్వరి చుట్టా లేమి బూమెలు నేనేవు
రవ్వల నాఁడు బుద్ధులు రండూ రెండే

॥ పల్లవి ॥

కన్నెలం అలుక దీర్చి కాఁగిలించఁ బెట్టఁగాను
చన్నులుఁ జన్నులుఁ దాఁకి చప్పుడాయను
మొన్నికఁ గపటములు మొదలోనివి మాన్పేవా
సన్నల సవతులైతే జాతివైరాలు ॥ ఎవ్వ ॥
మానినుల నివ్వరిని మాటలాడించఁగాను
తేనెలుఁ దేనెలు సోఁకి తియ్యనాయను
నానిన వెంగేల వాఁడినాఁటినవి మానిపేవా
పూనిన పరుసవంతు పొరపొచ్చాలు ॥ ఎవ్వ ॥
కూడిన సిసతులనుఁ గూచుండఁ బెట్టుకోఁగా
తోడులు నీడలు నొక్క దోమటాయను
వాడిక పిన్నపెద్దల వావి నీవు వద్దనేవా
యీడుతో శ్రీవెంకటేశ కుందులు. ॥ ఎవ్వ ॥ 273

శ్రీరాగం

ఎరుఁగుదుము నీ నాయాలేల చెప్పేవు
వొరిమె గలవాఁడవు వూరకుండ రాదా ॥ పల్లవి ॥
మొగమోట గలవారు మోహించిన సతులకు
తగవు చెప్పేరా తప్పకుండాను
మగఁడ వైతేనేమి మచ్చికగలచోటికి
తెగెవా పరులకైతే దీకొందువుగాక ॥ ఎరు ॥
చుట్టపుఁ బొందైనవారు చూచి చూచి సవతుల
యెట్టయినా వున్నట్టే యేలాదేరు
దిట్టవైతేనేమి నీతీరుకు వచ్చేవారిఁ జే
పట్టవా వింతవారైతే భ్రమయింతువుగాక ॥ ఎరు ॥
కడు వేడుకకాండ్లు గలిగినట్టె ధర్మము
నడపేరా శ్రీవెంకటనాయక నేఁడు
అదరి నన్నుఁ గూడితి వాపెనుఁ గొంతమాత్రము
విడిచేవా యిది నీ వేసాలింతేకాక. ॥ ఎరు ॥ 274

### సాళంగనాట

ఇంకాఁ జదివేవయ్య యిటువంటివి
లంకెలాయ నీవిద్య లావరివి నైతివి ॥పల్లవి॥

పెదవిపై నుడివులు ప్రియముల బద్దలు
యెదిగాఁ జదివితివి యిపుడు నీవు
పదపు సతులు నీతో(నీతో)వాదించే వారెవ్వరు
తుదకెక్కె నీవిద్య వొద్దవాఁడ వైతివి ॥ఇంకా॥

మంతనపు మంత్రాలు మంకుగోరి యంత్రాలు
యింతనా నేరుచుకొంటి విపుడు నీవు
జంతల సతులు నిన్ను సాధించే వారెవ్వరు
కొంతియున్నది నీవిద్య వొద్దవాఁడ వైతివి ॥ఇంకా॥

అట్టియిన సత్యాలాఁడి జోలినిత్యాలు
యిట్టివె నేరుచుకొంటి విపుడు నీవు
గట్టిగా శ్రీవెంకటేశ కాఁగిలించితివి నన్ను
తొట్టెను నీవిద్యలెల్ల వొద్దవాడవైతివి. ॥ఇంకా॥ 275

### దేసాళం

మావంటివారి దీవెన మరి యేకాలము గను
భావించి యిచ్చినవిది బతుకఁగదయ్యా ॥పల్లవి॥

వెలలేని వలపులు వేమారు గొనఁగాను
బలిమెత్తి తమకము లాభమాయను
పలచని వద్ది(ట్టి?)శిగ్గు పదారువేలకుఁ దారె
బలిమి నీకఁ గోటికిఁ బడిగెత్తవయ్యా ॥మావం॥

చదరపు సరసాలు చాలుమూలనదవఁగా
గుదిగొన్న నగవు లగ్గువ లాయను
అదిగో పట్టపుదేవు లారడి పంతముచేరె
పదరక నవరాజ్యపట్ట మేలవయ్యా ॥మావం॥

పాయపు తరితీపుల పంటలెల్లఁ బండఁగాను
చాయల రతిభోగాలు సదరమాయ
యీమేత శ్రీ వెంకటేశ యిటు నన్నుఁ గూడితివి
లాయపుటింతుల పొఁజులనుఁ గూర్చవయ్యా. ॥ మాదం॥ 276

247-వ రేకు నాదరామక్రియ

ఊరకుండవయ్యా వుడివోవు వలపులు
కోరుకొంటా వున్నదాన గొప్పలు నీకన్నులు ॥ పల్లవి ॥

చనవు నీవిచ్చితివి చలము లన్నియుఁ దేరె
మనసొక్కటాయ నీతో మారుమాటేల
ననిచివుందాన నిదె నన్ను నేల రేఁచేవు
వినుకొంటానున్నదాన వింతలు నీసుద్దులు ॥ ఊర ॥

ప్రియములు చెప్పితివి పెనఁగితివిందాఁక
నయమాయ సరసాలు నవ్వులంతేల
క్రియ నే నెఱుఁగుదును కెరలించ కిఁక నీవు
జయము చేకొంటి నిదె చక్కనె నీమాటలు ॥ ఊర ॥

తెలిపితివి బుద్ధులు దిష్టముగాఁ గూడితివి
వెలసె నీమోహములు వెరపు లేల
యెలమి శ్రీ వెంకటేశ యెచ్చరించకు గోరను
తలపోయుచున్నదాన తగు నీగుణములు. ॥ ఊర ॥ 277

మధ్యమావతి

దానికేమి యిప్పుడేమి తప్పిపోయీనా
వూని యెదురుకట్లనె వున్నాఁడుగా ॥ పల్లవి ॥

అలసిన రతివేళ ఆడినట్టి యీమాటలు
తలఁచుకొమ్మనవె తనుఁ దానె
పిలిపించి నాతోఁ దాను పెనఁగిన పెనఁగులు
తెలిపే లేవె యింకా తెరమరఁగుననె ॥ దాని ॥

చిరుముడి మంచముపై చెనకిన చెనకులు
తరవి చూచుకొమ్మనవె తన మేననె
వురివోక తాయమారై వునిచిన వుంగరాలు
తరఁబడి వేళ్లను తానెరఁగఁడా ॥ దాని ॥

కొత్తగా నాకాఁగిటిలో కూడినట్టి కూటములు
యెత్తి యిమ్మనవె యీవేళనె
హత్తెను శ్రీ వెంకటేశుఁ డట్టై తా నన్ను
తత్తరపుఁ దమకము తనివి నొందీనా. ॥ దాని ॥ 218

## శ్రీరాగం

చిన్నఁబోయివుందాననా చేరి నీతో నలిగేనా
సన్నల నిన్నుఁ జింతించే జాడ లింతేకాక ॥ పల్లవి ॥

నెక్కొన్న వేడుకలకు నీవు గలవు మాకు
చెక్కుచేరితోడుతను చింత మాకేల
వక్కణతోఁ గన్నుఁగలువలు గలమోముతోడ
గుక్కక తామెర చేయుఁ గూర్పితిఁగాక ॥ చిన్న ॥

దట్టమై నామతిలోన తను నీరూపెతయము
వట్టి విరహాన వసివాడనేల
పట్టి తనువల్లిగాన పన్నీరు గంద మంటుకు
పెట్టి పొరలించి మెత్తి పెద్దసేసేఁగాక ॥ చిన్న ॥

కాఁగిట నీవుగలవు కమ్మఁజెమటల రతి
నాఁగి యాఁగి సారె సారె నలయనేలా
కాఁగిటఁ గూడితి శ్రీ వెంకటేశ నీ యలపార్చ
వేఁగక విట్టూరుపుల విసరేఁగాక. ॥ చిన్న ॥ 279

## రామక్రియ

అటుగాన యెంచనేల ఆవలివారి భాగ్యము
యెటులైనా నీపట్టు కెప్పుడును మంచిదే ॥ పల్లవి ॥

తప్పు నీయందున్నదా తగవరి వన్నిటాను
  చొప్పు లెత్తఁ బోతేను సూటికిరాదు
కప్పురపు చవిలోన కారముఁ గొంతునా
  కప్పిన విరహాలకే కాఁక లౌఁగావో ॥ అటు ॥

నరవి నీవెరుఁగవా సర్వజ్ఞుఁడవు నీవు
  కెరలించఁ బోతేను కిందుపడును
వరుసలఁ బూవులకు వాఁడి తొల్లివున్నదా
  విరవపువేళనే వెల్లివి రౌఁగాదో ॥ అటు ॥

చేకొననివాఁడవా శ్రీ వెంకటేశుఁడవు
  కాకు సేయఁ బోతేను గరివడును
యీకర చంద్రుడు వెట్టా యేలితివి నన్ను నిట్టే
  పైకొని అలిగేవారి పాలిటికి అవుఁగాదో. ॥ అటు ॥ 280

ముఖారి

ఏఁటిమాఁట లిటువంటి వేలాదేవు
  గాఁటమై యేకతమైతేఁ గాదనేనా ॥ పల్లవి ॥

చెప్పినట్టు సేతుఁగాక చిత్తములోపలి సిగ్గు
  వొప్పగించి నీముందర నూరకుందేనా
కుప్పలైన కుచములు కొండలవలె నుండఁగా
  తప్పక నాపయ్యదను దాఁచుకుందునా ॥ ఏఁటి ॥

సమ్మతించి వుందుఁగాక జవ్వనపు నాగుట్టు
  కుమ్మరించి నాకు నాకె కొనవేతునా
తెమ్మలైన పిరుఁదు మరుతేరువలె నుండఁగాను
  నెమ్మది నీకెదురుగా నిలుచుందునా ॥ ఏఁటి ॥

కూడితివి మెత్తుఁగాక కొనగోరి చేఁతలను
  వేడుకకాని తనమును వెలివేతునా
యీడనె శ్రీ వెంకటేశ యెనసితి మిద్దరము
  వాడిక వలపు లింక వడియఁ గట్టుదునా. ॥ ఏఁటి ॥ 281

అహిరి

నెంత( జూసితే నీకు నిమిష మే(దవును
యెలమి దగ్గరివుంటే నే(డు నిమిషమవును ॥ పల్లవి ॥

కన్నుల( బెట్టినయట్టి కాటుకచూపులు నీపై
పన్ని చెలి చల్లితేనె పగలు రేయౌ
వున్నతి పద్మరాగాల వుంగరాలచేతినిన్ను
తిన్న(గా నంటితే నప్డె తెల్లవారును ॥ నెల ॥

వీడెపుమోవినెలవి వేడుకతో నవ్వితేను
నీడల( గాసిన వెల్లా విందు వెన్నెలౌ
పాదితో యించుకవడి ప్రణయకలహమయితే
యేదచూచినా నదె యెండగాసును ॥ నెల ॥

శ్రీవెంకటేశ యిప్డె చెలి నిన్ను(గూడె(గాన
తోవలుగా మోవిమీ(ది( జుక్కలు నిండె
వేవేలు రతులచేత వెలయ(గా దిక్కులెల్ల
కావిరి మాని హృదయకమలము నించెను. ॥ నెల ॥ 282

248-వ రేకు ఉద్ధవసంతం

సంగడినున్నవారము సాకిరి చెప్పకపోదు
యింగిత మెరి(గి నీవె యియ్యకోవయ్యా ॥ పల్లవి ॥

వనిత చూచినదెంత వడి నీవేల లో(నేవు
చెనకినదెంత నీవు నేసేదెంత
వినవయ్యా ఆపెమాట వే(డుకొనె నింతగద్దా
యెనసి ఆడినమాట కియ్యకోవయ్యా ॥ సంగ ॥

ఆపె నవ్వినది నవ్వు అప్పటి నీమతి దవ్వు
పోపో మరునియేటు పూచిన పువ్వు
వోపవయ్యా చెలి నిన్ను వొరసి చన్నులనూ(ది
తీపులమోవికతలు తెలుసుకోవయ్యా ॥ సంగ ॥

పిలిచిన పిలుపేడ విగిసే సిగతి యేడ
వలపుల కిదా జాడ వట్టిది నీడ
యెలమి శ్రీవెంకటేశ యింతి నిన్ను నిదె కూడె
పలుకుఁ బంతాలు నీ కెప్పటివలెనయ్యా. ॥ సంగ 283

రామక్రియ

బల్లిదుఁడవైతివి బతుకవయ్యా
పొల్లలేకుండా నిన్నుఁ బొగడేమయ్యా ॥ పల్లవి ॥

యెక్కుడి కెక్కుడి బుద్ధిలెవ్వరు చెప్పేరయ్యా
చిక్కి నీకుఁగాఁగ ఆపె చెప్పెఁగాక
తక్కక యెవ్వరు జాణతనాలు నేరిపేరయ్యా
నెక్కొన్న చుట్టరికాన నేరిపెఁగాక ॥ బల్లి ॥

రతి నెవ్వరి కెవ్వరు దాయిదండయ్యేరయ్యా
అతివ నీకుఁగాఁగా నాయఁగాక
రతుల కెవ్వరిపాటి రమ్మని పిలిచేరయ్యా
గతియైవుండె తానె గక్కునఁ బిలిచెఁగాక ॥ బల్లి ॥

కందువతో నెవ్వరు కాఁగిలించుకొనేరయ్యా
అంది నిన్నుఁగాఁగా ఆపె అలమెఁగాక
యిందులో శ్రీవెంకటేశ యిట్టె నన్నుఁగూడితివి
విందువలె తానూ నీవెంటవచ్చెఁగాక. ॥ బల్లి ॥ 284

భైరవి

పూవువంటిదానను పూఁపవంటిది వయసు
సావధానమున నీ సంసారపలము ॥ పల్లవి ॥

నీవు బోధించినయట్టి నిజములె నానిజము
భావించి నీవు నడపె పంతము నాది
లావుల నీమన్నన కొలఁదుల వారమునేము
వోవసేసి మమ్ము నేల వారసేవువిభుఁడా ॥ పూవు ॥

చక్కఁగా నీవు నడపె సమేళము నాసరిగె
చెక్కుల నీవు వొత్తిన చిన్న లివిగో
పక్కన నీవు గప్పినపచ్చడము నామీఁ దిది
తెక్కుల నన్నెంత కెంత తెలిపేవువిభుఁడా ॥ పూవు ॥

కాఁగిట నీవుగూడిన గరిమ నేఁ డొగదేది
మాఁగిన నీమోవితేనె మావిందులు
రాఁగిన సంతోసపు రతుల నన్నేలితివి
చేఁగదేరించఁగ నేల శ్రీ వెంకటవిభుఁడా. ॥ పూవు ॥ 285

## సాళంగం

అనవలసేమైనా విన్నంటిఁగాక
మునుకొని నే నీకు మొక్కకుండేనా ॥ పల్లవి ॥

సంతతము నందరును జయలువెట్టఁగ నీకు
కాంత లిఁక వేరె విన్నుఁ గాదనేరా
వింతగా ఆవులు నీవెంటవెంటఁ దిరుగఁగా
మంతనాన గోపికలు మరుగకుండేరా ॥ అన ॥

పచ్చి పిల్లఁగోవిలోన బలు రాగాలు రాఁగాను
రచ్చకెక్కే సతులెల్ల రాకుండేరా
గచ్చులసిరి మోహాన కమలాన వేయఁగాను
తచ్చి రుక్మిణి పువ్వులదండ వేయకుందునా ॥ అన ॥

విందు జలధులనీరు విన్నుం గంచెఁ బేరఁగాను
అంద మావలపు పేరే దదియెంత
కొండల శ్రీ వెంకటేశ కూడితిమి నేము విట్టై
వుండనుండఁదరితీపు (లూ?) చూరకుండినా. ॥ అన ॥ 286

## సామంతం

దొరలకె కానిలేదు తుంటతనము
జరసి నీతో నవ్వ సరిదాననా ॥ పల్లవి ॥

పతినలు వలుకఁగఁ బలుమారుఁగొసరఁగ
కతగరచినవారుగాని నేరరు
మతిఁ బెట్టుకొని సారె మమ్మునే నమ్మించేవు
చతురతఁ బెనఁగ నీసరిదాననా ॥ దొర ॥

బిడిబిడిఁ దిరుగఁగ పైపై బుజ్జగించఁగ
గడుసులయినవారుగాని నేరరు
అడియాసలు పుట్టించి ఆయము లేలించేవు
వడిఁబెట్టి నిన్నుఁదూర సరిదాననా ॥ దొర ॥

రాయడిరతిఁ బెనఁగ రారాఁపులకు నోప
కాయాటులయినవారుగాని నేరరు
యీయెడ శ్రీ వెంకటేశ యిటునన్నుఁ గూడితివి
చాయలు దోదించ నీకు సరిదాననా. ॥ దొర ॥ 287

సౌరాష్ట్రం

ఏల సాకిరి గోరేరు యిద్దరు నన్ను
నాలి నేఁ జూచినప్పుడె నవ్వుతానె వుంటిరి ॥పల్లవి॥

మతకా లెరఁగఁగాని మగువ నీమోముచూచి
చతురతలు మెరసి జంకించెను
రతికి దగ్గరఁగాని రహస్యాన నీవుండి
మితిమీరి కొనగోరు మీటుకొంటివి ॥ ఏల ॥

తగవులు చెప్పఁగాని తరుణి నీవన్నందుకు
వొగరుఁజూపుల పెదవులఁ దిట్టెను
మిగిలినవేవోకాని మీదమిక్కిలి నీవైతె
జిగిఁ బంతములు చూపి చెలఁగితివి ॥ ఏల ॥

యీరీతి వేరుసేయఁగా నింతి శ్రీవెంకటేశ్వర
గారవించి నిన్నుఁ గూడి కాఁగిలించెను
తేరెఁగాని నీవల్లనె తేటతెల్లమై నేఁడు
మేరతోనె పంతమిచ్చి మేకొంటివి. ॥ ఏల ॥ 288

249-వ రేకు శ్రీరాగం

గొల్లెతలై తేనె కొంటా
పల్లవపు నీచే పదిరిగాకా ॥ పల్లవి ॥

కొలుచుఁబదనుల కాంతల నేఁ డిచ్చె
వంచుకొన నీకువసమా
పంచబాణముల దారికి లోనై
ముంచి చేతులెత్తి మొక్కిరిగాకా ॥ గొల్లె ॥

కోడెవయసు కామెరలేమల
వాడికెకుఁ జేనువసమా
కూడఁగూడఁ బిల్లఁగోవి రాగాలకు
వాదవారు వెంటవచ్చిరిగాకా ॥ గొల్లె ॥

కొలఁదిలేనట్టి గుబ్బెతలనెల్ల
వలపించుకొనవసమా
యెలమి శ్రీవెంకటేశ కూడఁగాను
పొలసి చనవుచూపిరిగాకా. ॥ గొల్లె ॥ 289

శుద్ధవసంతం

పెనఁగకువే యింక ప్రియునితో నీవింత
మనసు లెఱుఁగుదుము మరి మాటలేలే ॥ పల్లవి ॥

తలుకదేరిచి పతి అచ్చె పైకొనఁగాను
చలమరితనమేల సతులకును
జలజలఁ జెమరించె జాజుకొనఁ బులకించె
చెలఁగి వేగి మిగిలి చీఁకటులు గలవా ॥ పెన ॥

నవ్వు నవ్వి యాతఁడె ననుపులు సేయఁగాను
రవ్వలఁ బెట్టఁగనేలే రామలకును
జవ్వనపు కళలుబ్బె సమ్మతులు మతికబ్బె
పువ్వులలోపలిపొల్లి పూఁచిదెప్పఁగలవా ॥ పెన ॥

శ్రీవెంకటేశ్వరుఁడు చెక్కునొక్కి వేఁడుకోఁగా
వేవేలు మాఁటలేలే యీవెలఁదులకు
నీవాతనిఁ గూడితివి నీటులునుఁ జూపితివి
వేవల చిగురు నాఁడె నేసిపెట్టఁగలవా. ॥ పెన ॥ 290

కొండమలహరి

అమ్మరో యెంతగడుసరి వదేమె నీవు వల
పమ్మకతొల్లె కానేవు అదేమె నీవూ ॥ పల్లవి ॥
మలసి విభుఁడు నీతో మాటలాడకతొల్లె
అలిగి యెగ్గులువట్టే వదేమె నీవూ
కలసి యాతఁడు నిన్నుఁ గరఁగించకతొల్లె
అలసి వుస్సురనేవు అదేమె నీవూ ॥ అమ్మ ॥
చక్కఁగాను నీపతి సరసమాడకతొల్లె
అక్కడజీరె ననేవు అదేమె నీవు
తక్కక యాతఁడు నీకు తమ్ముల మిడకతొల్లె
అక్కట కారమనేవు అదేమె నీవూ ॥ అమ్మ ॥
యెనసె శ్రీవెంకటేశుఁ డిప్పుడు యింతకతొల్లె
అనుకొనే వాలనంటా నదేమె నీవూ
చెనకిరి వితఁడు పైఁ జేయి చాఁచకతొల్లె
అనలుఁగొనలకెక్కే వదేమె నీవూ. ॥అమ్మ॥ 291

మంగళకౌశిక

ఎందాఁకాఁజూతుము నే మిటువంటి యాగడాలు
అందినచెలులము నే మాడకుండరాదు ॥ పల్లవి ॥
వువిద తాఁ బెట్టె తొంటి వుంగర మిమ్మంటేను
యివల నింతదొరవు యేల తిట్టేవు
జవళిగన్నీరుతోడ చలపట్టుకుండఁగాను
తవిలి నీకింకా నేల దయవుట్టదు ॥ ఎందా ॥

నీలాగులుచూచి యాపె నీదావ వొప్పగించితే
కోలుముందుగా నేం కొంగువట్టేవు
తూలెటినెరులంతోడ దోపిలించి మొక్కఁగాను
పొలువడి దోసానకు భయమేలపుట్టదు || ఎందా ||

వలఁతి నీగుణాలకు పయ్యద దిగించుకొంటే
సడిఁబెట్టి నీవేం చన్నులంటేవు
తొడరి శ్రీవెంకటేశ దొమ్మిఁగలసితి వాపె
జడిసి గోరంటినా నెచ్చరి కేలపుట్టదు. || ఎందా || 292

వరాళి

వారివారిభాగ్యము వలపుల కొలఁది
నేరుపు గలిగితేను నిన్నమాపే రేపూ || పల్లవి ||

కనుసన్న నాపె నిన్నుఁ గరఁగించఁ జూచితేను
యెనసి అవె(వ?)మ్ములైతే నేమిసేసును
వెనుకొని అవియెల్ల విరహవేళ నింతె
మనసు లొక్కటైతె తామరపూజలవును || వారి ||

వుదవి చన్నులనొత్తి వూరడించఁ జూచితేను
యివె పిడిగుండ్లయితే నేమిసేసును
పవళించి అవి రతిపంతమాడేవేళవింతె
కవగూడితేను జక్కవరూపులవును || వారి ||

పెదవులెత్తి చెలియ ప్రియము చెప్పఁజూచితే
యెదురుగాలములైతే నేమిసేసును
కదియనివేళ నింతెకాని శ్రీవెంకటేశుఁడ
యిదె కూడితివి యివె యిఁక తేనెలవును. || వారి || 293

హిందోళవసంతం

ఏఁటికి వేగిరపడే వింతలో నీవు
మేటిరమణుఁడ నిన్నె మెప్పించేఁగాకా || పల్లవి ||

మచ్చిక సేసినచెలి మాటలాడకమానీనా
దిచ్చరి నీతలఁపులు దెలిసీఁగాక
యిచ్చకము నీవాడఁగా నియ్యకొనకుండీనా
కచ్చుపెట్టి కొంతగొంత కైకొనీఁగాకా ॥ ఏఁటి ॥
దగ్గరివచ్చినచెలి తప్పకచూడకుండీనా
సిగ్గులు నీపైఁ గొంత చిమ్మీఁగాక
వొగ్గి విడెమిచ్చినాపె వోపననీనా యిఁక
నిగ్గులవలపు నీకు నేరిపీఁగాక ॥ ఏఁటి ॥
చేకొని కూడినమీఁద సేవసేయకమానీనా
యీకడ ముంచువెనక రెంచీఁగాక
శ్రీకాంతనేలితివి శ్రీవెంకటేశ్వర నేఁడు
మాకొరకు విన్నాపె సమ్మతింపించీఁగాక. ॥ ఏఁటి ॥ 294

250-వ రేకు ముఖారి

ఊరకుండుమనవే వొక్కటొక్కటే రేఁచక
తేరకత్తెనై తేనేమి తిద్దుబడి తనదే ॥ పల్లవి ॥
తగిన నాచెలువము తనకె తలవాయ
పొగడఁగవలెనా పొరుగులను
నగిన నానగవులు ననుపులకునువచ్చె
మగనాలనై తేనేమి మనువెల్లాఁ దనదే ॥ ఊర ॥
పట్టిన నాపంతమిది పైపైఁ దనలోనాయ
అట్టె నన్నేల మెచ్చీనె అందరితోను
తిట్టిన నాతిట్టులివి దీవెనలై సరిదాఁకె
చుట్టమనై తేనేమి సొమ్మయితిఁ దనకే ॥ ఊర ॥
యిల్లిదె నాజవ్వనము యెప్పుడూఁ దనకెఅబ్బె
వెల్లవిరి సేయనేలె వీధివీధిని
చెల్లుబడితోఁ దానె శ్రీవెంకటేశుఁడుగూడె
గొలదాననై తేనేమి కొలువెల్లాఁ దనదే. ॥ ఊర ॥ 295

సామంతం

ఉందరే యెక్కడినుద్ది వారలరవకురే
యెందరెల్లనీరలాయ నిద్దరికి మాకు ॥ పల్లవి ॥

కూరిమిలేనిపొందు కొనలెటువలెసాగు
పేరులేని పిలుపుల ప్రియమెట్టాను
తాపుతాడించేనంటే తానాద నేవీత
మారుత్తరమియ్యరాదు మనసులేయెరుఁగు ॥ ఉంద ॥

నగవురానిమేలము నయమెటువలెనౌను
మొగముచూడనిమొక్కు మోచేదేద
తగులఁబెట్టేనంటే తతిలేదు మితిలేదు
పగటు లాదఁగరాదు పట్టినదేపంతము ॥ ఉంద ॥

పలచఁగానిసిగ్గులు పనికెటువలెవచ్చు
చలివాయనివలపు సాదించేదెట్టు
యెలమి శ్రీవెంకటేశుఁ డీదనుండె నన్నుఁగూడె
వెలపరచఁగరాదు వేడుకలేనిందెను. ॥ ఉంత ॥ 296

ధన్నాసి

మాపుదాఁకాఁ గొసరిన మాను మానే రాయి రాయే
దాపుదండ నీవు నాకు తగవు నీచేతిది ॥ పల్లవి ॥

మొక్కలపు మాటలెల్ల మొన్ననె ఆడితిఁగాని
పుక్కటయిన నిన్ను నేనుఁ బొగడ నేఁడూ
వుక్కువంటి గుండెలోన లక్కవంటి మనసిదే
దక్కియున్నదాన నీకు ధర్మము నీచేతిది ॥ మాపు ॥

అంగడిఁ బెట్టినచేఁత అప్పుడెపెట్టితిఁగాని
ముంగిట నీసుద్దులెల్ల మూనేనిపుడు
యెంగిలిసెలవిలోన రంగువంటిమనసిదే
పొంగివున్నదాన నీకు పుణ్యము నీచేతిది ॥ మాపు ॥

లోచి నిన్నుఁ గూడేది లోననే కూడితిఁగాని
యేచి నిన్నుఁగూడేను యీవాయ నేము
చేచేత నిదేవులను శ్రీవెంకటేశుఁడవు
తాచియున్నదాన దయ దలఁపు నీచేతిది. ॥ మాపు ॥ 297

కేదారగౌళ

నేఁడుగొత్తలా తన నేరుపులివి
వాఁడిపెట్టి ముంటికొన వాములడిచేనా ॥ పల్లవి ॥
కాలిమ్మంటినే యిఁక గావని యెదురాడనే
తానాడినదే మాట తప్పులులేవు
రానీవే యందుకేమి రతిఁ గరఁగించుఁ దాను
నానఁబెట్టీగొద్దలి సన్నల నింతయేఁటికే ॥ నేఁడు ॥
దాసయిచ్చితినే తనపంతము చెల్లించేనే
నేసినదేచేఁత మరి చిక్కులులేవు
ఆసపడనీవె తాను అంబుధులు పేరఁబెట్టు
కోసి రాతనారాలిచి కూరిమి లింతేఁటికే ॥ నేఁడు ॥
కూడితినే కాఁగిటను గురుతులు నించితినే
ఆడనీవే సరసాలు అంకెలాయనే
వేడుకవెలవెట్టె శ్రీ వెంకటేశ్వరుఁడు తాను
పీడెమిచ్చి బుజ్జగించీ వేసాలిఁకనేఁటికే. ॥ నేఁడు ॥ 298

ముఖారి

ఏఁటికి బాఁతిపడేవు యేల మమ్ముఁ జెనకేవు
కాటుకవన్నెచూపులు కలవి మాజూ(చూ?)బు(పు?)లు ॥ పల్లవి ॥
కిన్నెరలె గొప్పలుగాని కదుఁ గొంచపు మొకము
యెన్నఁగ మాచక్కఁదన మేమున్నది
వున్నతాలె కుచములు వొంటినడుము సన్నము
యెన్ని చూడఁబోతేను యిదివో మాసొబగు ॥ ఏఁటి ॥

దారెఁడె కురులుగాని చేరఁదేసి పాదాలు
యీరీతిదె మాగుట్టు యేమున్నది
నోరు మాణిక్యాలగని నొక్కఁతేఁ దేనెపెదవి
పేరుకొనఁబోతేను పెలుచు మాగుణము ॥ ఏఁటి ॥

చేతులె మెత్తనగాని చిమ్మ గోళ్ళు కఠినాలు
యేతులు నెమ్మెలు మాయందేమున్నది
ఘాతల శ్రీ వెంకటేశ కలసితి విటునన్ను
నీతి విచారించుకొంటే నిండెను నీమన్ననే. ॥ ఏఁటి ॥ 299

దేసాక్షి

ఇంతి నీసొమ్మగాదా యెరవున్నదా
వింతవారివలె నేము వెంగె మాడేమా ॥ పల్లవి ॥

జగడాలన్నియుఁ దేరె సతి నీతో సంతమాయ
మగుడి మగుడి నీతో మాటలింకానా
తగవరి వవుదువు తప్పులు నీయందు లేవు
మొగము చూచి చూచి మొక్కు లింకానా ॥ ఇంతి ॥

పనులెల్లాఁ జక్కనాయ పదివేలువచ్చె నేఁడు
చెనకి చెనకి నీతో చేఁత లింకానా
వెనకటి వెంతలేవు వేడుకకాఁడవు నీవు
కొనచూపులనుఁ జూచి కొసరు లింకానా ॥ ఇంతి ॥

కోరికలు గొనసాగె కూటములు మీకు నబ్బె
సారె సారెఁ గొసరేటి చల మింకానా
యీరీతి శ్రీ వెంకటేశ యిచ్చకుఁడ వన్నిటాను
చేరి నీవు నవ్వఁగాను సిగ్గు లింకానా. ॥ ఇంతి ॥ 300



# సూచిక ౧

—(౦)—

## సంకీర్తన రాగముల అకారాది సూచిక

| రాగములు. | | సంకీర్తనల సంఖ్యలు. |
|---|---|---|
| అహిరి | .... | 25. 33. 61. 65. 106. 147. 150. 183. 202. 215. 249. 258. 282. |
| కన్నడగౌళ | .... | 12, 126. 144, 181. 185. 225. |
| కాంభోది | .... | 16. 118. 158. 167. 177. 208. 239. 266. |
| కేదారగౌళ | .... | 17, 64. 127. 199. 238. 264. 298. |
| కొండమలహరి | .... | 56. 74. 191. 291. |
| గుజ్జరి | .... | 210. |
| గౌళ | .... | 27. 54, 91. 130. 142. 198. |
| ఛాయానాట | ... | 128. |
| తెలుగు కాంభోది | .... | 70. 263. |
| దేవగాంధారి | .... | 42. 60. 103, 169. 228. |
| దేసాక్షి | .... | 48. 58. 78, 111. 170. 235. 259. 300. |
| దేసాళం | .... | 10. 62. 93. 164. 186, 222. 227. 244. 270. 276. |
| ధన్నాసి | .... | 59. 113. 149. 262, 297. |
| నాగవరాళి | .... | 160. |
| నాట | .... | 40. 145. 194. |
| నాదరామక్రియ | .... | 8. 23. 47. 75. 119. 157, 217. 234. 251, 277. |
| నారణి | .... | 3. 55. 112. 236. |
| పాడి | .... | 20. 36. 66. 102. 123. 129, 178. 206. 211. 224. 2[illegible]. 254. |
| బౌళి | .... | 14. 24. 32. 87. 105. 223. 240. |
| బౌళిరామక్రియ | .... | 148. 205. |
| భూపాలం | .... | 104. 166. |
| భైరవి | .... | 30. 39. 69. 95, 133. 152. 165, 195. 204. 207. 230. 285. |

# సూచిక ౩

—(౦)—

## సంకీర్తనల అకారాది సూచిక

